# అరక్షణీయ

[ శరత్ బాబు ]

అనువాదం :

శ్రీ నీలకంఠం

ప్రచురణ :

శ్రీ వ్యాససారస్వత సమితి, బెజవాడ.

# అరక్షణీయ

## 1

"చిన్నత్తయ్యా!- మాఅమ్మ ప్రసాదం పంపించింది- తీసుకో-"

"యెవరూ?- అతులా...?రా నాయనా రా" అంటూ దుర్గమణి వంటింటిలోంచి బైటకువచ్చింది. అతులుడు నమస్కరించి ఆమె పాదధూళిని తలమీద జల్లుకున్నాడు.

"ఆరోగ్యవంతుడవుకా నాయనా!- చిరంజీవి వవుతావు" అంటూ దీవించి-పిల్లను పిలిచింది"ఓజ్ఞానదా! నీఅతులుడు తిరిగివచ్చాడు. ఒక ఆసనం తెచ్చివేసి- ప్రసాదం తీసుక వెళ్లమ్మా!.....అవును రాత్రి తొమ్మిదిన్నర పదిగంటలప్పుడు యీదోవంట గుర్రబ్బండి టకటకధ్వని వినిపించింది. యెవరోచూద్దామని అనుకున్నాను. అక్కయ్య అని తెలిస్తే, పరుగెత్తుకుంటూ వెళ్లి ఆమె పాదరజస్సును తీసుకునేదాన్నే! అక్కయ్యలాంటి మనుష్యులు యీలోకంలో యెక్కడైనా కనుబడుతారూ?- సరే నాయనా...అక్కయ్య వంట్లో కులాసాగావుందా?-మీరిప్పుడు పూరీనుంచేవచ్చారనుకుంటాను... యేంచేస్తున్నావే-? నీ అతులుడింకా నిలుచునే వున్నాడు"

తల్లి పిలవడంతోనే – పన్నెండు పదమూడేండ్లపిల్ల చేతిలో ఒక ఆసనంపట్టుకుని లోపలినుంచి బైటకువచ్చింది. ఆ పిల్ల వీలయినంతవరకూ తలవంచుకుని మెట్లమీద ఆసనం పరిచి - వెనక్కువచ్చి అతులునికి నమస్కరించింది. ఆమె మాట్లాడనూలేదు. తలెత్తి అతన్ని చూడనూలేదు. నమస్క రించి ఆకుతో కట్టబడిన ప్రసాదపు దొన్నెను తీసుకుని మెల్ల మెల్లగా లోపలికెల్లింది.

కొంచెం జాగ్రతగా చూస్తే ఆ పిల్ల ముఖమండలం మీద ఓ అవ్యక్తపు నవ్వు కనుపిస్తుంది. ఆ సంతోషం ఒక్క పిల్లకేకాదు. అతులుని ముఖంమీదకూడా ఓ చిరునగవు మెరిసి పారిపోయింది!

అతులుని తండ్రి జడ్జిపని చేసి- చాలాడబ్బు సంపా దించి కొన్ని జమీందారీలను కూడా కొన్నాడు. ఆయన చని పోయి షుమారు నాలుగు సంవత్సరాలయింది. రెండునెలల క్రితం అతులుడు బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడై తల్లిని వెంట తీసుకుని తీర్థ యాత్రలు చేసి– రామేశ్వరము మీదుగా పూరీ నుంచి యింటికి వచ్చాడు. ఆ సంగతంతా యిప్పుడతను దుర్గమణికి చెప్పాడు.

ఆమె అంతావిని ఓ నిట్టూర్పువిడిచి– "నేనొక మహా పాతకురాలిని నాయనా!– యెక్కడికీ వెళ్లలేకపోయినా, ఒక సారి కాశీవిశ్వనాథుని చూసి తరిద్దామని వుంది. కానీ, యీ జన్మకు ఆ యోగంవుందో లేదో-?" అని అంది.

"చిన్నత్తయ్యా!- యేంలాభం, మానవులు మన స్సంతా నిలుపుకుని- అన్నిటినీ వదిలిపెట్టి వెళ్తేనే యేదైనా- లేకపోతే కాశీకి వెళ్లు యింకెక్కడికన్నా వెళ్లు- యేమీలాభంలేదు-ఆవిధంగా బలవతం మీద మా అమ్మగారిని తీసుక వెళ్లకుంటే- ఆమె వెళ్ళ్కుండేదా-?"

"నీకన్నీ తెలుసునాయనా! మరి నే నెవర్ని బలవంతం చేయను? నన్నెవరిలా తీసుకెళ్తారు? ఆయనగారికి ముప్పై రూపాయల నౌకరాయె! ఆ ముప్పైరాళ్లబలంతో నే- యింత కూడూగుడ్డా, అప్పుడపుడు చుట్టపక్కాలూ ...యీ సంసారమూ, యిదంతా సంబాళించుకోవాలిగదూ!- పైగా యెవరికన్నా జబ్బుచేస్తే వైద్యులఫీజూ, మందుమాకులూ-యీవన్నీ గడవాలి!...యింతసంసారం నెత్తిమీదవున్నపుడు- నేనేవిధంగా మిగిల్చి యాత్రిలు చేయగలను నాయనా! యిటుచూస్తూ చూస్తుండగ నే పిల్లకు పదమూడోయేడుకూడా ప్రవేశించింది. ఆ పిల్లనుచూస్తుంటే వంట్లోనిరక్తమంతా గడ్డకడ్తుంది....... యిది నీకుకాబట్టి చెప్పాను!"

ఆమాట చెపుతుంటేనే ఆమెకళ్ళు నీళ్లతోనిండిన్ని గద్గదికమైన ఆకంఠస్వరాన్ని విని, జాలిచూపడానికి బదులు అతులుడుకిలకిలనవ్వి-"అత్తగారిమాటలు చాలావింతగాఉన్నాయె! నువ్వసలు బెంగపడడానికి కారణమేముంది? ఆడపిల్లలు యెవరికీ లేరాయేం? ఆడపిల్లవున్నంతమాత్రాన లోకములో వున్న యిబ్బందులూ బాధలూ, నిన్నేచుట్టుకున్నట్లు యెందుకంతెగాయిదవుతా వత్తయ్యా?" అనిఅన్నాడు.

"నామనసులో యేవిచారమైతేవుందో, దాన్నియిబ్బందులనీ, బాధలనీ, బెంగలనీ నేనుచెప్పలేనతులా?— అదినాకు మృత్యుయంత్రంలాంటిదిగా మారిపోయింది!-మనసమాజపుపరిస్థితులు నీకుతెలుసు... పిల్లకుపెళ్ళిచేయలేని అసమర్థులమైతే, మనల్ని యీజాతిలోనుంచి దూరంగా తొలిగిస్తారు. నీకుతెలియని దేముంది?-అయినా, పెళ్ళి యేవిధంగాచేయను?- ఆడపిల్లపెళ్ళంటె డబ్బులేని దేకాదుగదా?- యికడబ్బుకా యేవిధమైన దారీకనబడడంలేదు... వృత్తాదికారణమైన సూత్రంతో, పగిలిపోయిముక్కలై నాశనమయేందుకు సిద్ధంగావున్న యీ యిల్లు మాత్రం మిగిలింది. యిదితప్ప, నాదనిచెప్పుకునేందుకు మిగిలిందేమీ లేదు నాయనా-?"

పిల్లపెళ్ళినిగురించి అరగంటకిత్రితం భార్యాభర్తలకు వాదోపవాదంజరిగింది. భర్తసగంతిండితిని- కంచాన్ని అవతలకునెట్టి, అర్థాకలితోనే ఆఫీసుకువెళ్ళాడు...... యీకారణంవల్ల దుర్గమణిహృదయంలో చేయిపెట్టికలిచినట్లు కళ్ళంట రెండుచుక్కలనీళ్లు జారికిందపడినై! చేత్తో ఆకన్నీళ్లు తుడుచుకొని "పూర్వజన్మలో నేనెన్నోస్త్రీహత్యలూ, బ్రాహ్మణహత్యలూ చేసినందుకు యీజన్మలో నాకీపిల్లకలిగిందేమో నాయనా?" అని అన్నది.

"యిటువంటి మాటలనకత్తాయ్! .. సరే!- యిలా అయితే, నేను వెళ్ళిపోతాను. అందాకా నీవు వూరుకో వు."

మళ్లీఒకసారి కన్నీళ్లుతుడుచుకుని దుర్గమణి- "కూర్చో నాయనా!-ఇంకాకొంచెంసేపుకూర్చో!-రెండుమూడుగంటలు

నీకీసంగతులు చెప్పి,- కష్టాలు వెళ్ళబోసుకుంటే, హృదయం కొద్దిగ తేలికవుతుంది.... యీ దౌర్భాగ్యురాలిని నాకడు పునపడేసేప్పుడు-దానివంటికికొంతరంగును అందాన్ని యెందు కని యివ్వలేకపోయావు భగవంతుడా!- అని—పరిస్థితుల్ని బాగాఆలోచించి నీముందు అంటున్నానునాయనా?- యీ నల్లటిపిల్లను యెవరూ తమ యింటికోడలుగా స్వీకరించడానికి వప్పుకోవడంలేదు...ఛీఛీ.. యీసమాజానికి కులమూ, శీల మూ, గుణమూ, స్వభావమూ యేమీఅవుసరంలేదు. యీ పిల్ల నల్లగా వుందనేగా, యెవరింట్లోనూ స్థానంలేకపోయిం ది...?-" అని వాపోయింది.

"అయితేనల్లటిపిల్లకు పెళ్ళికాదూ?- ప్రకృతిలో పుట్టి మనకళ్ళముందు తిరుగుతుండే కంటికిగ - నల్లగావుంటుంది. కోయిలనల్లగావుంటుంది. నల్లగావున్నంతమాత్రాన అవి అం దంగావుండడంలేదూ? - వాటికిఆదరణలేదూ? యివన్నీయెప్ప టినుంచో మనకళ్ళముందు కనుపిస్తూ సమాజంలో పాతుక పోయిన దృష్టాంతరాలు చిన్నత్తయ్యా!"

"అవును ఆదృష్టాంతరాలు అనురత్వం చెందేవున్నాయి కానీ,-వాటివల్లయేమీలాభంలేదు... యీదృష్టాంతరాలవల్ల హృదయానికిశాంతిగాని, బలంగానియేమీవుండదు అతులా!- గిరీశభట్టాచార్యుని కూతురుపెళ్లిచూసినప్పుడు నాప్రాణంయెగిరి పోయింది అతులా- పాపంసరిగ్గా నాఅవసలాంటిదే అతని కూతురు! అతనిదగ్గర డబ్బుబలంకానీ, పిల్లకుఅందంగానీ లేక పోయినంతమాత్రాన, ఆపిల్లను అరవైయేళ్ల ముసలిభర్త్తదొరి

కాదు... ఆపిల్లతల్లి యేడుపు యిప్పటికీ, నా చెవుల్లో గింగురుమంటూ నేవుంది–"

అతులుడు ఆశ్చర్యంగా – "అరవై సంవత్సరాలా?– నిజంగానా అత్తయ్యా?" అని అడిగాడు.

"యెందుక్కాదు నాయనా! హరిచక్రవర్తి అల్లుడి సంగతి నువ్వువినలేదా?– అతనికి వయసుతక్కువా యేమిటి?– చేతుల్లోడబ్బూ, పిల్లకుఅందమూ లేకపోతే, యిటువంటి ముసలివాళ్ళుతప్ప– నల్లటిపిల్లలను చేసుకోవడానికి యెవరు ముందుకు వస్తారు నాయనా?"

ఆవిషయంవిని–అతులుడు ఆశ్చర్యంగా ఆమెముఖం లోకిచూసాడు. దుర్గమణిమళ్ళీ అంది.–"యిలాంటిముసలివాళ్ళు భర్తలుగా దొరకడంమూలాన, ఆడపిల్లమనసు చెడుత్రోవకి దారితీస్తుంది యీ చెడ్డబుద్ధులవల్ల విషంతాగ్రడంగానీ, వురి తీసుకోవడంగాని– లేదా, కులానికి చెడ్డపేరు తేవడానికి లేచిపోవడంగాని జరిగితీరుతుంది. అటువంటప్పుడు మననేంచేస్తాం? నాకూ ఒక ఆడపిల్లవుంది."

అతులుడు యేమీమాట్లాడలేదు.

దుర్గమణి గబుక్కున అతనిచేయిపట్టుకొని, –"నాయనా అతులా! యీరోజుల్లో నీలాంటివాళ్ళదగ్గర, దయాధర్మమూ వినయవివేకమూ, వుంటుందని అందరూ అంటారు. చూడు నాయనా!– నీకుపరిచయస్తులైన స్కూలు కుర్రవాళ్ళుగానీ, కాలేజీ కుర్రవాళ్ళుగానీ– యెవరోఒకరు యీపిల్లను జీవితాంతం భరించేందుకు ప్రయత్నంచేయ్!– నువ్వీపనిచేసావంటే,

చిరకాలం నీకు కృతజ్ఞురాలినిగా వుంటాను నాయనా!" అని అన్నది.

అతులుడు పరియత్నంమీద ఆమె చేతులోని చేయివిడిపించుకుని-ఆమె పాదధూళిని తీసుకుని బొంగురుపోయినకంఠంతో"- యెందుకిలా గాబరాపడతావు అత్తయ్యా!- నేను ప్రతిజ్ఞ......" ఆపైమాట పెకిలిగాలేదు.

తనుచేసే ప్రతిజ్ఞ యేమిటో అతనికే తెలియలేదు. అతనిముఖమంతా యెరుపెక్కింది, కంఠంరుద్ధమైంది. తనను తాను సంబాళించుకుని లేచి నిలుచుని "-సరే అత్తాయ్- తప్పకుండా పరియత్నించిచూస్తాను... యేం? జ్ఞానదా-నువ్వెక్కడున్నావు? రెండోమూడో తమలపాకులు తెచ్చివ్వు-యింటికి వెళ్ళాలి?" అనిపిలిచాడు.

కొంచెంకోపంతో దుర్గమణి- "-గుమ్మయ్- వినపడదా? నీ అతులుడికి తమలపాకులూ వక్కపొడీ యిచ్చివెళ్ళు జ్ఞానదా-!యీపాడుముండకు అందములేదు- జ్ఞానంలేదు ప్రతి సంగతీ చెబుతూవుండాలి ... పరిసాదం తీసుకుని లోపలకు వెళ్ళింది మొదలు- యింతవరకు మళ్ళీ బైటకురానే లేదు.... యికనైనా తొందరగా ఆకులు తెచ్చివ్వు?" అసలరిచింది.

"సరే-నేనేవెళ్ళి తీసుకుంటాను నువ్వేగదిలోవున్నావ్ జ్ఞానదా-?" అనిగట్టిగా అరుస్తూ అతులుడు పడకగదిలోకి వెళ్ళాడు.

ఆకులు, వక్కలసామాగిరి దగ్గరపెట్టుకుని జ్ఞానద కూర్చునివుంది, లోపలికి వెళ్తూనే అతులుడు"— యీపాడు

జ్ఞానదకు అందమూ లేదు. జ్ఞానమూ లేదు. ఓ అరవై సంవత్స రాలముసిలాడికి దీన్నిచ్చి పెండ్లిచేయాలి?- ''అని అన్నాడు.

జ్ఞానద-జవాబేమీ యివ్వలేదు. ముఖంవంచుకునే పళ్లెంలోని ఆకులూ- వక్కపొడీ అందించింది.

అతులుడు ఆమెవెనక్కువచ్చి ఆకులు తీసుకుంటూ "యివిబాగావుంటే-అరవైసంవత్సరాలముసలివాడికిచ్చే బదులు యిరవై, యిరవై ఒక్క సంవత్సరాల లోపున్నయువకుని కిచ్చి నిన్ను క్షమిస్తాను?'' అని అన్నాడు.

సిగ్గుచేత- జ్ఞానదముహం మరీక్రిందకు వంగిపోయింది. మెల్లిగా అతులుడు "యివాలల్లా నేను అత్తగారితో మాట్లా డుతూనే కూర్చున్నాను. మధ్యాహ్నంకూడా అయింది. యిక వెళ్తాను-''అనిఅన్నాడు.

యీమాటకూడా జ్ఞానద యేమీ జవాబివ్వకుండా యెలాకూర్చునివుందో అలానేవుండిపోయింది.

"నాతోమాట్లాడవూ?- సరే?'' అంటూ అతులుడు తడిసి వీపుమీద వేలాడుతున్న ఆమెజుట్టులోని కొంతభాగా న్ని చేత్తోపట్టుకుని లాగుతూ "మాట్లాడవుకదూ?-కానీ-... హరిచక్రవర్తిలాంటి ముసలిమొగుడు వస్తాడులే!- యిక నేను వెళ్తాను.'' అని నవ్వుతూ నవ్వుతూ గదిలోంచి బైటకు వచ్చి- గుమ్మంలో కాలుపెడుతూనే పెద్దగా "-చిన్న త్తయ్యా- జ్ఞానదకోసం బొంబాయిలో అమ్మరెండుగాజులు కొనుక్కొని వచ్చింది. వీటిని నువ్వు బైటకువచ్చి ఒకసారి చూడు-'' అనిపిలిచాడు.

ఆగాజులరంగూ, వాటిమీదచెక్కినగిల్టీకళలుచూసి- దుర్గమణి ఆనంద భరితురాలైంది! ఆమె మాటి మాటికి అతులునితల్లిని పొగడడం మొదలు పెట్టింది. ఆ రెండుగాజులూ కంచువే! అయినా ఆపనితనాన్ని చూస్తుంటే, అవి యెంత ఖరీదైనా పెద్దపెద్ద పట్నాలలోనే- దొరకవని అనుకుంది!

తల్లిమాటిమాటికీ పిలవడంవల్ల- జ్ఞానద బైటకు వచ్చింది. తలవంచుకునే, నిశ్శబ్దంగా- స్నేహంతో కూడిన యీ మొదటి బహుమతిని తీసుకోనడానికి చేతులురెండూ చాపినప్పుడు. ఆమె చేతులు మెల్లిగా కంపించినయ్'- తరు వాత అతులుని పాదాలకు నమస్కరించి మెల్లి మెల్లిగా అక్క ణ్ణుంచి వెళ్ళిపోయింది, జ్ఞానద నోటినుంచి ఒక్కమాటకూడా బైటకు రాలేదు.

## 2

ముగ్గురన్నదమ్ముల సమిష్టి కుటుంబమది! పెద్దవాడైన గోలోకనాథ్ చనిపోయాక, అతనిభార్య స్వర్ణమంజరి తన చిన్నమరిది అనాథనాథుడి వద్దకువచ్చి కాలంగడుపుతూవుంది! అన్నదమ్ములెవరూ లేనందున తలిదండ్రుల సంపదకు కూడా వుత్తరాదికారిణియై, ఆసంపదనంతా అమ్మి, చిన్నమరిది వద్దనే విశ్రాంతిగా వుంటూవుంది! రెండోవాడైన ప్రియనా థునికి,మూడోవాడైన అనాథనాథునికిపోట్లాటవచ్చిన్యాయంగా తమకు రావలసిన ఒక యింటిని ఆ యిద్దరూ పంచుకున్నారు. పంచుకున్నాక ప్రియనాథుడు ఆయింటికి మధ్యస్తంగా గోడను

కట్టించుకోవాలని, శక్తిలేక వూరుకున్నాడు. చివరకు అన్ని వుద్దేశాలు అతనిలోనే వుంచుకుని, ఒకనాడు యేడురోజుల జ్వరంతో- మందుకూ, మాకుకూ డబ్బులేక, అటూఇటూ కొట్టుకుంటూ చనిపోయాడు.

రేపటిరోజున అతను చనిపోతాడనగా, ప్రియనాథుడిక బ్రతకడని ఆవూర్లోనివాళ్లంతా వచ్చి తలుపువద్ద గుమికూడారు. అటువంటప్పుడు కూడా ప్రియనాథుడు ఆదుర్దా పడలేదు. అతులుడు అప్పట్లో వూళ్లోలేడు. కలకత్తాలో చదువుకుంటూ ఒకమెస్‌లోవుండి- కఠోరమైన ఆ సంగతినివిని, వెంటనే పరుగెత్తుకుంటూ వచ్చి, గుంపును అటూయిటూ త్రోసుకుని అతను రోగిగదిలోకి వెళ్లాలని ప్రయత్నిస్తూ వుండగా—జ్ఞానద పిచ్చిదానిలా అతనిముందుకు వచ్చి, పాదల మీదపడి- తలను బాదుకుంది!

రోగిని చూడ్డానికని వచ్చినవాళ్లందరూ, విస్మయంగా యీ దృశ్యాన్ని చూస్తూ, మనసులోనే తర్కవితర్కాలు చేసుకున్నారు. యింతమంది మనుష్యులముందు సిగ్గుచేత అతులుడు యేమీ మాట్లాడలేక పోయాడు.

క్షణమయ్యాక అతులుడు మామూలుమనిషై, జ్ఞానదను పట్టుకుని లేవదీయబోయాడు. కానీ,- జ్ఞానద తనశక్తినంతనూ వుపయోగించి గట్టిగా ఆ కాళ్లను పట్టుకుని "మా నాన్నగారు చచ్చిపోయే స్థితిలోవున్నారు. ఆరాటపడుతూ వున్న వారిప్రాణానికి శాంతివచనాలుచెప్పి, బాధను తొలిగించండి.........నావల్లవారికి యేర్పడిన బాధలను, వారు

యిక్కడే వదిలిపెట్టి, సుఖంగా వెళ్లేట్టుచూడండి... యీ దౌర్భాగ్యపురాలి భవిష్యత్ జీవితంలో, మిమ్మల్ని నేనింకే మీ కోరను- యీ దురదృష్టపురాలి అదృష్టంలో, యెలా రాసుందో- అలానే జరుగుతుంది''-అని యేడుస్తూ చెప్పింది.

ఆమెచాలావ్యాకులంగా వుంది. అనేకవిచారాలూ, బాధలూ- జిజ్ఞాసలు • మనసులో నేవుంచుకుని-యెక్కువవయసు కాకముందే ఆమెతండ్రి మృత్యుముఖంలోకి వెళ్ళబోతున్నాడు. యీ ఆదుర్దాతోనే, జ్ఞానద మంచీచెడూ యేమీఆలోచించ లేకపోయింది! యింతమంది మనుష్యులయెదుట తనుయేం చేస్తుంది? యేంచెపుతుంది?- ఈ విషయాల్ని ఆలోచించడానికి ఆమెకు శక్తి లేకపోయింది. కానీ,- అతులుడు చాలా నెమ్మదిగలవాడవడంచేత, జ్ఞానదచేసిన యీవ్యవహారానికి అతను తనమనసులో యెంతజాలిపడినా- చూసేవాళ్లకు కఠోరంగా కనుపించాలని, బలవంతంగా ఆమెనులేవనెత్తి- మెల్లిగా- "ఛీ యెందుకేడుస్తావు జ్ఞానద-? యేడ్చినంత మాత్రాన లాభంలేదు. నేను చెప్పవలసిందంతా మీ నాన్న గారితో చెపుతాను-'' అని, అతులుడు స్వర్గలోకానికి వెళ్ళేందుకు సిద్ధంగావున్న ప్రియనాథుని మంచందగ్గరకువెళ్లి ఒక ప్రక్కకూలబడ్డాడు. భర్తగారి తలవేపు కూచునివున్న దుర్గమణి- అతులుని ముఖంచూసి యేడ్చింది.

ఆ పరిసరప్రాంతంలో వుంటున్న నీలకంఠచటర్జీ గుమ్మందగ్గర నిలుచుని వున్నాడు. అతులుడు యేమీమాట్లాడక పోవడంమూలాన అతను "-ప్రియనాథుడికి యింకా

కొంచెం తెలివివుంది తమ్ముడూ? నువ్వు చెప్పదలచుకున్న దేదో గట్టిగా చెప్పు. అప్పుడుగాని అతనికివినపడదు.'' అనిఅన్నాడు.

ఆ వృద్ధుడు చెప్పినమాటల్ని, యింకాయిద్దరుముగ్గురు ఆమోదించారు. ద్వారంవద్దవున్న యీ గుంపునుచూసి అతులునికి కోపం వచ్చింది. అందువల్ల అతను గట్టిగా "-మీరంతా యీవిధంగా గుంపులు కూడడం యేమంత బావుండలేదు. కొంచెం గాలీ, వెలుతురూ రావడానికిదూరంగా వెళ్ళికూర్చోండి!- నేనుచెప్పవలసిందేదో చెపుతాను-'' అని అన్నాడు.

అతులుడు చెప్పిన యీమాటలకు నీలకంఠచటర్జీ కోపం తెచ్చుకుని "-వూరికే. మేమెందుకు నిలుచుంటాము తమ్ముడూ?- పొరిగింటివాళ్ల కష్టసుఖాలు కనుక్కుంటానికి పొరిగింటివాళ్ళేవస్తారు. ఒక్కసారిగా ఆ మంచంమీదకూచుని నువ్వుచేసే ఆవుపకార మేమిటి?'' అని అడిగాడు

అతులుడు లేచినిలుచుని "-నేను వుపకారం చేస్తానో చేయనో ఆ సంగతిమీకెందుకు? యీవిధంగానే గుంపులు కూడితే, రోగికి యింకా యెక్కువయాతన కలిగించినవాళ్ళవుతారు... దయుంచి మీరంతా బైటికివెళ్ళండి.'' అని అన్నాడు.

అతులుని ముఖచిహ్నాలుచూసి నీలకంఠచటర్జీ రెండడుగులు వెనక్కువేసి-" నిన్నమొన్నటి కుర్రకుంకవు. నీవే యిలా మితిమీరి మాట్లాడుతావ్?- సరే! "అనిగొణిగాడు.

యింకొక మనిషి నీలకంఠచటర్జీ పక్కనే నిలుచుని "యితను- యఫ్. ఏ. బి, ఏ. ప్యాసయ్యాడుకదూ?"- అని అన్నాడు.

పదిసంవత్సరాల కుర్రవాడొకడు తొంగి చూస్తున్నాడు. యెవరూ మాట్లాడక పోవడంచూసి అతులుడు ఆ కుర్రవాణ్ణి తోసాడు. ఆతోపుకు కుర్రవాడు, రెండోవాడి మీదపడ్డాడు. యిదంతా చూస్తున్న నీలకంఠచటర్జీవాళ్ళంతా పెద్దవాళ్ళుగనుక బైటకు వెళ్ళిపోయారు.

అందరూ బైటకు వెళ్ళాక, స్వర్గానికి ప్రయాణం చేస్తున్న రోగిముఖంవద్దకు వంగి "మామయ్యా?" అని అతులుడు పిలిచాడు.

రక్తంతో కూడుకున్న కళ్లను విప్పి, ప్రియనాథుడు అతన్ని చూసాడు.

అతులుడుఅడిగాడు "నన్ను గుర్తుపట్టావా మామయ్యా?"

కంళ్లు మూసుకునే అస్పష్టముగా ప్రియనాథుడు "అతులా?" అని అన్నాడు.

"యెట్లావుంది మామయ్యా-?"

తలఅడ్డంగా తిప్పుతూ- "యెలావున్నదని చెప్పను... యేమీ బావోలేదు-" అని ప్రియనాథుడు అన్నాడు.

అతులుని రెండుకళ్లూ నీళ్లతో నిండిపోయినై! పెద్ద కష్టంతో వాటిని బైటకు రానీయకుండా, బొంగురుపోయిన కంఠాన్ని సరిచేసుకుని- "మామయ్యా ఒకసంగతి మీతో

చెబుతున్నాను. యివాల్టినుంచి జ్ఞానద బరువంతా నేను మోస్తాను. మీరు నిర్విచారంగా వుండండి'' అని అన్నాడు.

అతులుని మాటలు యేమీ అర్థంకాక, యిటూ అటూ చూసి ప్రియనాథుడు- "జ్ఞానద యెక్కడుంది?'' అని అడిగాడు.

అంతా వింటూవున్న దుర్గమణి యేడుపు ఆపుకోలేక భర్తగారి ముహంమీదపడి యేడుస్తూ, యెంతో కష్టంమీద యేడుపును ఆపుకుని- "ఒకసారి జ్ఞానదను చూస్తారా?''-అని అడిగింది.

ప్రియనాథుడు కొంతసేపటివరకూ యేమీ మాట్లాడలేదు. చివరకు- "చూడను'' అని అన్నాడు.

దుర్గమణి గట్టిగా బావురుమని యేడ్చింది. యేడుస్తూ యేడుస్తూనే-"అతులుడు యేమంటున్నాడో విన్నారా? అతను మీ జ్ఞానద బరువు మోయడానికి సిద్ధంగావున్నాడు. యిక మీరు దిగులు పెట్టుకోకండి......ఆ అభాగినిని మీరుచూడక చాలా రోజులయింది. యివాళైనా ఒకసారి పిలిచి- ఆ అభాగినికి ఆశీర్వాద మివ్వండి-'' అని అన్నది.

ప్రియనాథుడు వూరికేచూస్తూ వుండిపోయాడు.

దుర్గమణి మళ్లీ ఆమాటలే చెప్పింది. ఆనాడు మాత్రమే ప్రియనాథుని కళ్లంట రెండుసీటిచుక్కలు జారి క్రిందపడినై! తన నిర్బలమైన చేతుల్ని కష్టంగా పైకెత్తి అతులుని తల నిమిరి- ఒకప్రక్కకు వత్తిగిలి పడుకున్నాడు! అతని నోటినుంచి యేమాటా బైటకురాలేదు. కానీ,- అతనికి మృత్యువు చాలా

దగ్గరగా వుండని అతులుడు గ్రహించి, అకస్మాత్తుగా బావురు మని యేడ్చాడు. ఆ యేడుపుకు సాక్ష్యము దుర్గమణీ- భగవంతుడ్తూతప్ప యింకెవరూ లేరు.

రెండోరోజు సాయంకాలం, ఆఫీసునుంచి వచ్చే ముప్పై రూపాయల నౌకరీ మనుతను వదలి, యిరవై ఆరు సంవత్సరాల భార్యనూ, పదమూడేండ్ల పెళ్లికాని కూతుర్నీ మోయలేక- తులసిచెట్టుదగ్గర ప్రాణాన్ని త్యాగంచేసాడు. ముప్పైఆరు సంవత్సరాల వయసువాడైనప్పటికినీ, యెనభై సంవత్సరాల వృద్ధునిలా రోగంతో యుద్ధంచేస్తూ చేస్తూ, 'గంగా-నారాయణా-బ్రహ్మ' అనేపేర్లను జపిస్తూ, హిందువుల పుణ్యాలోకానికి తన శరీరాన్ని పరిత్యజించి వారిపోయాడు.

## 3

ప్రియనాథుని కర్మ క్రియలు అయిపోయిన పదిహేను రోజులకు- చిన్నతమ్ముడు అనాధనాథుడు జాయింటు స్థలములో గోడ పెట్టి ఓతలుపును తగిలించాడు.

ఒకనాడు ఆఫీసుకు పోదామని బట్టలు వేసుకుని గుమ్మంలోకివచ్చి. "- నీకు అన్నివిషయాలూ చెప్పనవసరం లేదు వదినా... అంతానీకు తెలుసు! - అన్నయ్య బ్రతికున్నపుడు నాతో యెన్నితగాదాలు పెట్టుకుని పోట్లాడి అనవసరంగా మాట్లాడక పోయినా, 'యిప్పుడుమీాకు పిడికెడుమెతుకులుపెట్ట డానికి, నాకేమీాకష్టంగాలేదు... కానీ, పెద్దదయిన నీ కూతురు జ్ఞానదపెళ్ళిచేయడానికి మాత్రం నాకువీలుపడదు.

పేరుకు నెలకు నూటయాభై రూపాయల జీతమైనా,- పిల్లా జెల్లాగల నాకుటుంబంకూడా తక్కువదేమీకాదు? పైగా నాకూతురుకూడా పన్నెండోయేడువచ్చింది. చూస్తూనే వున్నావుగా?- అందుకని జ్ఞానదనుతీసుకుని కొంతకాలం హరిపాలెంలో మీఅన్నయ్యదగ్గరకు వెళ్ళివుండు-'' అనిచెప్పాడు.

మరిదిగారి మాటలువింటూ దుర్గమణి వంటింటిలో యెలాగోసెలుచుని, ఆఖరికి భయపడుతూనే, నొక్కులు పడుతూన్నగొంతుకతో "-అన్నగారిసితిగతులు నీకు తెలియనివి కావుఅనాథ్-! ఆయనదగ్గరయేమీలేదు. పైగా యీకబురు వినికూడా ఆఖరికి చూడ్డానికికూడారాలేదు.... రెండోది, వాళ్ళువచ్చి తీసుకుని వెళ్లందే నాఅంతటనేను యేమని వెళ్లను ?'' అనిఅన్నది.

స్వర్ణమంజరి గోడపక్కనేవుండి "- అవును మీ అన్నగారిస్థితి యేమంతబాగులేదనినాకుకూడా తెలును- చెల్లీ మరి మరిదిగారు ఏమంతగొప్పవాడని చెప్పు?-చెప్పుకోవడానికి నూటయాభైరూపాయలేగాని, అవియేలాసర్దుకుని వాడుకొని వస్తున్నామో, ఆభగవంతునికే తెలియాలి. యింకోసంగతి- యింత యెదిగిన కూతురు బరువును- తమంతటతాముగా నెత్తిమీద వేసుకోవడానికి యెవరొస్తారు?..... యిక మానాభిమానములుపెట్టుకునికూర్చుంటే, పనికాదమ్మాయ్?'' అనిఅన్నది.

"అవును. నాకింకా యెక్కడి మానాభి మానాలు అక్కాయ్?'' దుర్గమణి మెల్లమెల్లగాఅంది.

స్వర్ణమంజరి- మరిదిని యెడమచేత్తో వెనక్కుత్రోసి, ముందుకువచ్చి నిలబడి -" నువ్వీలాసిల్లు నమలుతూ ... ట్లా డ్డానికి నేనేమీ చెడ్డమాటలనలేదు చెల్లీ ...! యిక నీయిష్టం. నేను మంచిదాన్ననుకో- చెడ్డదాన్ననుకో! వికారంగా వున్న నీకూతురు జ్ఞానదకుమాత్రిం మేము పెళ్ళిచేయలేమని నిర్మొహమాటంగా చెపుతున్నాను. చిన్న చెల్లెలికిక్కూడా ఓ ఆడ పిల్లవుంది. యెవరైనాసరే ఆ పిల్లనుచూడడానికి వచ్చారంటే రెండోపిల్లనసలు చూడనేచూడరు. .. యింకోవిధంగాఅనుకోకు చెల్లీ! నీకూతురు మొహం యెలావుంటుందో, అలాంటివాళ్ళు హరిపాలెంలో చాలామందివుంటారు. వాళ్ళల్లోఒకళ్ళకి నీకూతుర్నికట్టబెట్టి నీతలమీాది బరువును తగ్గించుకో!- అక్కడి వాళ్ళకి అందంచందం అవసరంలేదు,! ఆడపిల్లనిచ్చేవారికిందంటే వాళ్ళుధన్యులైనట్లుగా భావిస్తారు" అనిచెప్పింది.

దుర్గమణి మాట్లాడలేదు. యెవరిపెండ్లికనిఅన్నదమ్ములిద్దరూ వేరుపడిపోయారో, ఆమాటలేయిప్పుడు తిరిగి వాళ్ళు అంటున్నారు. ... ...

దుర్గమణి పూరుకోవడం చూసి, "- యేది యెలా జరగాలనివుంటుందో- అదిఅలానే జరిగిపోతుంది ... నిన్నవరకూ యేమీఅనరు. నన్నంతా నానామాటలు అంటున్నారు. చూడడానికీ, వినడానికీ కొంచెం అందంతోపాటు, చదువుకున్నఅల్లుణ్ని తీసుకరాకపోతే నన్నింకా యెగతాళి చేస్తారు. ...యింతడబ్బుండి- సంపాదన వుండిక్కూడా, మంచిపిల్లవాడు రాకపోతే- బంగారపు బొమ్మలాంటిపిల్లను నీళ్ళల్లో ముంచా

నని నన్నందరూ అంటారు. నిజం చెపుతున్నానా-లేదా, అనాథ్ ..." అని వక్రదృష్టితో అనాథనాథుని వేపు చూసింది.

"అవును నిజమే-!" అని మరిది తన వదినగారి మర్యాదను కాపాడి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

అతను వెళ్లాక స్వర్ణమంజరి "-మీ అన్నగారినేనువ్వు ప్రాధేయపడు. అతను యెవరినన్నా ఓ మగపురుగును పట్టుకుని నీ కూతురికి ముడిపెట్తాడు! యిందులో నువ్వేమీ సిగ్గుపడాల్సిన పనిలేదు. విన్నెవరూ యేమీ అనరు. మున్నైరూపాయల జీతం సంపాయించిన ప్రియనాథుడికి ప్రపంచంలో యెవరు తెలుసున్నారు? వీళ్లకు అన్నదమ్ములు కావడం మూలాన్నేగా, యీ పదిమందినైనా యెరిగుండడం!- .. రేపు చాలా మంచిరోజు. యికనువ్వు ఆలస్యం చేయకుండా రేపే వెళ్లు .." అని అన్నది.

దుర్గమణి మనసులో అతులుని సంగతి చెపుదామని ఆలోచించింది కానీ-పెద్దక్కవద్ద, మరిదిదగ్గరా ఆవిషయాన్ని గుర్తుకు తేలేకపోయింది. పెద్దక్కగారి సంబంధంతోనే అతులుడు తనకు సంబంధీకుడైనమాట యదార్థం!

ఆమె మాట్లాడకుండా యింట్లోపలికి వెళ్లేప్పటికి, జ్ఞాన నేలమీద పడుకుని వుంది. మెల్లమెల్లగా ఆమె ప్రక్కనకూర్చుని "- మీ పెద్దమ్మ చెప్పిన మాటలు...నువ్వు విన్నావా అమ్మాయ్?__" అని అడిగింది.

విన్నానని జ్ఞానద తలూపింది. తరువాత యేమని చెప్పాలో, దుర్గమణికి పాలుపోలేదు. తల్లి వూరుకుని వుండడం చూస్తి

"అమ్మమ్మ గారింటికి యెప్పుడూ వెళ్లలేదు కదమ్మా- ఒక సారి వెళ్లినద్దాంపదమ్మా!" అని జ్ఞానద తల్లిని అడిగింది.

"మీ అమ్మమ్మ లేదు జ్ఞానదా!- ఆమె యెప్పుడో చచ్చిపోయింది... నీ మేనమామ మాత్రం వున్నాడు. మనం యెలావుంది కూడా అతను తెలుసుకోలేదు. యింత ఆపదలో వున్నా-మనకు వుత్తరంకూడా వ్రాయలేదు. అటువంటప్పుడు మనమెలా వెల్దాం..."

"బాధపడేవాళ్ళసంగతీ- దుఃఖితుల సంగతీ యెవరికీ అవసరం లేదమ్మా! చివరి చూపులతోనైనా మనలని వాళ్లు చూడనప్పుడు, వీళ్లూ మనల్ని చూడరు...వీళ్లేమో, మనల్ని వెళ్ళమని అంటున్నారు...మన మానాభిమానాలు నాన్న గారితోనే పోయాయ్! పద-అక్కడికే వెళ్లుందాం..."

తల్లి కళ్లంట నీళ్లుకారాయ్! వాటిని తుడిచి, జ్ఞానద "నా మూలంగా నీ కెక్కడికి వెళ్లాలన్నా మనసు వప్పడం లేదని నాకు తెలుసమ్మా...! అలాకాకపోతే పెద్దమ్మ మాటలకి నువ్విక్కడ ఒక్కరోజన్నా వుండవు! యేంచేస్తాం? నాగురించి నువ్వేమీ దిగులు పెట్టుకోకమ్మా! పద, యెక్కడికన్నా వెళ్ళి- కొన్ని రోజులుపాటు వుండినద్దాం... లేకపోతే నువ్వు చచ్చిపోతావుకూడా..." అని బుజ్జగించింది.

తల్లియిక వుండలేక కూతురిని దగ్గరకు లాక్కుని గుండెలకు అదుముకుని వెక్కెక్కి యేడ్చింది. కూతురు ఆమెను బుజ్జగించలేదు. తనతల్లి వక్షస్థలంలో ఆమె ముఖం దాచుకుంది. చాలాసేపు యేడ్చి దుర్గమణి కన్నీళ్లు తుడుచుకుని-

"నువ్వే లేకపోతే, నేనుకూడా యీపాటికి వారిదగ్గరకు వెళ్లిపోయేదాన్ని! నీ మూలాన్నే నేనందుకు సాహసించలేకపోయాను-" అని అన్నది.

"ఆ సంగతి నాకూ తెలుసమ్మా-"

"సరేగాని- అతులుడు మీనాన్నగారు చనిపోతారనగా, అప్పుడామాటను యెందుకని చెప్పాడో నిజంచెప్పమ్మా. యిటుచూడు జ్ఞానదా, ముహం ముడుచుకుని సిగ్గుతో-కూర్చునే సమయంకాదిది... అతను అబద్ధం చెప్పడని నా నమ్మకం!... చచ్చిపోవడానికి సిద్ధంగావున్న మీనాన్నగారికి జ్ఞానద బరువునునేను మోస్తాను, నామాటనమ్మండి. అని యెందుకన్నాడు?- నువ్వెందుకతని కాళ్లమీద పడ్డావు?" అని అడిగింది.

"నాకేమీ తెలవదమ్మా-!" అని జ్ఞానదఅన్నది.

ఒక్కసారి తల్లి- కూతురుముఖాన్ని పైకెత్తిచూద్దామని గట్టిగా ప్రియత్నించింది. కానీ,- జ్ఞానదబలవంతంగా తల్లి వక్షస్థలంలో తనముఖాన్ని దాచుకున్నందువల్ల- వీలు లేకపోయింది.

"మీనాన్నగారు బ్రతికున్నంతకాలం నాకేమీ విచారాలూ, బాధలూలేకపోయినై! యీ ప్రపంచంలో మనల్ని వంటరిగాచేసి యిక్కడనుంచి వారువెళ్ళిపోవడంతోనే, యీ హృదయంలోకి యెన్నోవిచారాలు ప్రవేశించినయ్!- యేం చేస్తాం జ్ఞానదా? అతులుడు చెప్పినమాటలు వినికూడా, యింకానమ్మలేకుండా వున్నాను." అనిచెపుతూనే దుర్గమణి

కూతురుచేతులు తనచేతుల్లోకి తీసుకుని "- నిజంచెప్పమ్మా! నేననుకు నేమాటలు, ఆలోచనలు- అబద్ధాలు కావుగదా-? యివన్నీ నేనుకలలో చూడడంలేదుగదా-?" అని అడిగింది.

జ్ఞానద యేమీ మాట్లాడలేదు

ఆనందావేశంవల్ల దుర్గమణి యేడుస్తూ -" నన్నింతా అనుమానంలోనుంచి- యీ హృదయానికి బాధనుకలిగించ కమ్మా! ఒక్కసారి ఆ సంగతంతా నువ్వు పూసగ్రుచ్చినట్లు చెప్పు...... యీ సంగతంతా మీనాన్నగారికి నివేదించు కుని, నాహృదయంలోని కొంతబరువును తగ్గించుకుందామని అనుకుంటున్నాను. నాఆక్రిందననువారు తప్పకుండా యివాల వింటారు -" అనిఅన్నది.

కూతురు మెల్లగా "- అమ్మా- నాన్నగారి ఆత్మకు యీవిషయాన్ని గురించి నువ్వేమని నివేదించుకోవాలని అను కున్నావో అలానేనివేదించమ్మా!- నేనేమీ అడ్డుచెప్పను... ఆయనగారు నాన్నగారి ఆత్మకు శాంతికలిగేమాటచెప్పారు. అలా చెప్పమని నేను వారినికోరాను. వారుఅలానేచేసారు... యికవారిదయాధర్మమూ-వారివద్దనే వుంటాయి"అనిఅన్నది.

దుర్గమణి వుండలేక పోయింది. కన్నీళ్ళతో తడిసి- సిగ్గువల్ల యెరుపెక్కివున్న ఆమె ముఖాన్ని బలవంతంగా పైకెత్తి, మాటిమాటికీ ముద్దుపెట్టుకుని- మళ్లీ ఆముఖాన్ని వక్షస్థలానికి హత్తుకుంటూ, కన్నీళ్ళు తుడుచుకుని- "నువ్వు చెప్పేదంతా నిజమేనా జ్ఞానదా? నిజమేనా?- అతను చిరం జీవివవుతాడు! సావిత్రి యమున్ని ప్రార్థించి తనభర్త ప్రాణా

లు కాపాడినట్లు, అతనికి వచ్చినరోగాన్ని నువ్వు పోగొట్ట గలిగావమ్మాయ్-! ఆ అంటురోగానికి భయపడి, ఆఖరికి చూడ్డానికికూడా యెవరూ రాకపోయినా, నీవే అతులుని మంచంవద్ద రాత్రింబగళ్ళు కూర్చుని, సేవచేసి రక్షించు కున్నావు...... ఆమాత్రం ప్రతిఫలం తిరిగి అతనునీకు చేయ మా?''- అనిఅంటుంటే "- వింటున్నావా చెల్లీ?'' అనేమాట విని ఆమె కన్నీళ్ళు తుడుచుకని "- యేమిటక్కాయ్?'' అని అడిగింది.

ఆ యింటి పెద్ద కోడలు స్వర్ణమంజరి వంటింటిలోకి వక్కసారి దృష్టిసారించి, "-నీకు యేడుపులతో, పెడబొబ్బ లతో ఆకలి లేకపోవచ్చు కానీ,- యీయింట్లోని వాళ్లెవరూ వస్తులుండలేరు- యెంతపొద్దెక్కిందో బైటకువచ్చి చూడు-'' అని అన్నది.

దుర్గమణి బైటకువచ్చి, సూర్యునివేపు చూసి, కూతు రిని పిలుస్తూ లోపలికి వెళ్లబోతూవుంటే, స్వర్ణమంజరి తీక్ష ణంగా "-బాగానేవుంది! వంటపని అయింతర్వాత, యివాలల్లా కూతురుని బుజ్జగిస్తూ కూర్చున్నా ఫర్వాలేదుకానీ, యీ విధంగా పిల్లాజెల్లా ఆకలికి అలమటించడం మాత్రం చూస్తూ, నేను సహించలేను-'' అని సంతాన హీనురాలయిన పెద్దకో డలు, సంతానవంతురాలయిన మూడోకోడలి పిల్లలకు కష్టం లేకుండా వుండేట్లు మాట్లాడి, జవాబు కెదురుచూడకుండానే వెళ్లిపోయింది.

భర్తగారు చనిపోయాక రెండోకోడలు దుర్గమణి, మరిది అనాధనాథుని కుటుంబములో చేరి - వంటలక్క చేసే పని చేస్తూవుంది. అందువల్ల పెద్దకోడలకు, చిన్నకోడలకు కావలసినంత తీరుబడి సమయం దొరికింది. చుట్టు ప్రక్కల వాళ్లింటికి వెళ్లి "-యింట్లో యిప్పుడు ఖర్చు యెక్కువయిం దమ్మా!" అని చెపుతూ, శాపనార్థాలు పెట్టడం ప్రారంభించారు.

అనాధనాథుడు ఓ డెయిలీ ప్యాసింజరు! ప్రతిరోజూ ఉదయం యెనిమిదన్నర గంటల బండిలో నౌకరిచేయడానికి ఆఫీసుకు వెళ్లడం మామూలు! అందుకని వుదయాన్నే భోజనం చేయడం అతనికి ఓనియమమై పోయింది. ప్రతిరోజూ పెద్దకోడలూ- చిన్నకోడలూ అయనగారి భోజనాన్ని గురించి తొందరచేస్తూ- పోట్లాడుతుండేవాళ్ళు!

యీ విధంగా చాలారోజులు గడిచినయ్! కానీ, యివాళ వుదయ మవడంతోనే మళ్లీ వుపద్రవం వచ్చిపడింది! పనికత్తె చిన్నకోడలిని లేపి "-యేడు గంటలు కావచ్చిందమ్మా యింకా పొయ్యిలో పిల్లి లేవనేలేదు. మీరైనా కొంచెం పొయ్యి రాజేయ్యండి-" అని అన్నది.

చిన్నకోడలు కోపంతో "యేం-? రెండో అక్కాయ్ యేం చేస్తుందేం? యేడు గంటలయినా ఆమెగారికి యింకా నిద్రమెలుకువ రాలేదా- పాపం?" అని అడిగింది.

"మెలుకువ యెందుకు రాలేదమ్మా! ప్రొద్దున్నే లేచి తల్లీకూతురూ-తమబట్టలూ, వస్తువులూ, అన్నీ సర్దుకుని మూట

కట్టుకుంటున్నారు. యీ యెనిమిది గంటల బండికి, హరిపాలెమో- యింకెక్కడికో వెల్తారుకామాలు...!" అని పనిమనిషి అన్నది.

చిన్నకోడలికి నిన్నటి సంగతులు గుర్తుకు వచ్చినయ్! యిలా జరిగినందుకు ఆమె సంతోషించక కొంచెంకోపంతో "-యేమిటీ! వాళ్లంతట వాళ్లే వెల్లి పోతున్నారా?- ఐతే బాబుగారి నేమన్నా అడిగారా? పెద్దక్కగారి కేమన్నా చెప్పారా?" అని అడిగింది.

"బాబుగారి సంగతేమో తెలియదుకానీ,- పెద్దకోడలుగారు మాత్రం వాళ్ళను యివాలవెళ్లమని చెప్పారు-?"

"అలా అయితే- యెనిమిదిన్నరకల్లా వంటంతాతయారుచేసి వెళ్లమను... నాకింకేమీ తెలియదు" అనికోపంతో రెండోకోడలు వద్దకువచ్చి -"నువ్వెళ్లిపోతున్నావని మాకెవరికి తెలియదు. స్నానంచేయాలని వారేమో గంగానదికి వెళారు. నేనిప్పుడే నిద్రలోంచి లేచాను. అటువంటప్పుడు తొందరగా వారికి భోజనం యెలాచేయను?-" అని అడిగింది.

యిలా మాట్లాడుతూ వుండగానే వరండాలోకి అతులుడువచ్చి "నమస్కారమత్తయ్యా!" అనిఅన్నాడు.

రెండోకోడలికి పనులుపురమాయించి వెళ్లబోతూన్న చిన్నకోడలు గబుక్కున ఆగి "-నువ్వెప్పుడొచ్చావు అతులా-?" అని ప్రశ్నించింది

అతులుడు కలకత్తాలో చదువుతూ ఒక 'మెస్' లో వుంటుండేవాడు' అక్కడే అతులుడికి వుత్తరం అందింది-

రావడం జరిగింది. చిన్నకోడలి ప్రశ్నకు "-అత్తయ్యా హారి పాలెంలో ముక్తిపొందడానికి వెల్తుందని తెలిసినపుడు ఒక్క సారిదర్శనం చేసుకోవడానికైనారానా? మలేరియా డిపో లాంటి హారిపాలెంలోకి అత్తయ్యా కాలు పెడుతుందని విన్న తర్వాతకూడా వూరుకుంటానా? యింతప్రొద్దున్నే అశ్విని నక్షత్రపు మొదటిపాదంలో నిన్నోళ్ళమని యెవరు చెప్పా రత్తాయ్!- అరే... సామానుకూడా మూటలు కట్టుకు న్నారే?-" అని అంటూనే గదిలోని ఒకమూలలో, రక్తవర్ణ పునీళ్ళతోకూడిన రెండుకళ్ళనూ జ్ఞానద పైటచెంగుకు అద్దు కోవడం తొంగిచూశాడు.

చిన్న కోడలు "- నీకీ కబురు యెలా తెలిసింది అతులా?-" అని అడిగింది.

"నాకా-? జలే...!" అని నవ్వాడు.

అకస్మాత్తుగా లోపలనుంచి స్వర్ణమంజరి గొంతుక శబ్దభేది బాణంలా అందరి చెవుల్లోనూ పడింది. గంగానదిలో స్నానంచేసి మనసును శాంతింపచేసుకుని ఆమె యింటికి రావడంతోనే- దాసీది హాయిలో పిల్లి లేవలేదని చెప్పింది. అసలు రెండోకోడలు యీయింట్లో వంట చేసిపెట్టడానికే విధవ అయిందని, ఆమెతోపాటు అందరూ అనుకున్నారు. గబగబా పెద్దకోడలు రెండోకోడలిగదిలోకి కాలుపెడుతూ- "చిన్నబాబు అన్నం తినకుండా యింత ప్రొద్దున్నే ఆఫీసుకు వెళ్ళి, సాయంకాలంపూట చలిలో రావాలనుకున్నావా?

యింతకూ ఆయనకు జ్వరంవచ్చి నీలా సర్వనాశనం కావాలని చూస్తున్నావన్నమాట-" అని అడిగింది.

దుర్గమణి లోలోపలనే భయపడి-"యే ఆడదాని గీతా సరిగ్గా వుండనప్పుడు, తనగీతలా, తనకర్మలా- తన శత్రువుకూడా కలిగించమని భగవంతు న్నెప్పుడూ ప్రార్థించదు... అయినా నన్నీవిధమైన మాటలతో నొప్పి కలుగజేయడానికి నేను నిన్నేం కష్టపెట్టాను?" అని అడిగింది.

స్వర్ణమంజరి ముఖాన్ని వికృతంగా పెట్టి- "పాలు త్రాగే పసిపిల్లవుకదూ -పాపం! నీవేం చేసావో అదీ నేనే చెప్పాలా? యేడున్నరయిందికదా ఆఫీసు వేళకు అన్నం యెవరు వండుతారనుకున్నావ్?" అని అడిగింది.

తన పెద్దత్తయ్యస్వభావం తెలిసినవాడు కాబట్టి, యెక్కువ తక్కువేమీ మాట్లాడకుండా, యింతవరకూ అతులుడు మెదలకుండా విని- యీ ఆఖరిమాటలకు అసహ్యంతో- "నిజం మాట్లాడుతున్నానని నిష్ఠూరం చేయకు అత్తయ్యా!- తినడానికింత సంపద తరిగి పోకుండా వున్నంతకాలమూ మీ అన్నానికి యెవరూ రారు. యీ సంగతి మీకూ తెలుసు- యీ వీధిలోని వాళ్ళందరికీ తెలుసు! అయినా యీ అభాగ్యులు పాపం యివాలే వెళ్ళాల్సివచ్చింది. మీరు దయతలిచి వూరుకుంటే, మహాభారతయుద్ధాన్ని ఆపినవాళ్ళవుతారు." అని అన్నాడు.

అతులునిమాటలు దేవరాణికీ, పెద్దత్తయ్యకూ కష్టాన్ని కలుగచేసినయ్...! కోపంతో స్వర్ణమంజరి-

"యేంరా-అతులా? మాతో పోట్లాడ్డానికేనా కలకత్తానుంచి పరుగెత్తుకుని వచ్చావు-?" అని అడిగింది.

చిన్నకోడలు దేవరాణి "-పోట్లాడడానికి కాదక్కాయ్-! మన రెండో అక్కయ్యను గంగాస్నానానికి హరిపాలెం పంపుతున్నాము కదూ-? ఆఖరిసారి చూడాలని వచ్చాడట!-" అని అన్నది.

"ఓ-! అదా సంగతి."

"అవునక్కాయ్-! అదేసంగతి!- యీ యింట్లో వుంటున్న మనకే ఆమె వెళ్తున్న సంగతి తెలియదే- అటువంటప్పుడు కలకత్తాలో వుంటున్న యీ అతులునికి యీ సంగతి యెలా తెలిసిందా?- అని ఆలోచిస్తున్నాను. దీన్నిబట్టి చూస్తే, లోకులనుకునేది అబద్ధం కాదన్నమాట-"

ఆమాటకు స్వర్ణమంజరి మండిపడుతూ "సరే-అబ్బాయ్! పాపం యింత ఆవేదన నీ హృదయంలో వున్నప్పుడు, మరి వీళ్లను గంగలో యెందుకని కలుపుతావు? మీయింటికి తీసుకొని వెళ్లి అక్కడ ఆశ్రయాన్నెందుకివ్వవు? -యీమె నీ కిప్పుడు అత్తగారయిందికదూ-? తీసుకొని వెళ్ళి రక్షిస్తే వూళ్లోవాళ్ళంతా అప్పుడు నిన్ను బలే, బలే-మంచివాడని అంటారుగా-?" అని అన్నది.

స్వర్ణమంజరి నోటినుంచి వెలువడిన విషజ్వాలలకు అతులుని మనసు అయోమయంగా మారిపోయింది. "-బాగా నేవుంది అత్తయ్యా! మీరంతా ఒకటేగా-! వీళ్లు మాయింటికి రావడానికి యిష్టపడితే, తప్పకుండా నా తల

మీాద కూర్చోబెట్టుకుని నేను తీసుకొనివెల్తాను. దీనికి మీా వూరి వాళ్ళంతా బలే, బలే- అని అనండి- ఛీఛీ అని అనండి నాకేమీా ఫర్వాలేదు." యీామాటలని అతులుడు సిగ్గు అనే పరదానుంచి నిమిషంలో అందర్నీ బైటకు తీసుకుని వెళ్లి నిలుచున్నాడు.

బండివాడు యెద్దుబండిని తీసుకవచ్చి "-అమ్మాగ... టైం అవుతుంది. బండిలో పెట్టడానికి సామానేమన్నా యింట్లో వుందా చెప్పండి. తీసుకొస్తాను. యిప్పట్నుంచే వెళ్లకపోతే బండి దొరకదు-" అని అన్నాడు.

అతులుడు మెదలకుండా వెళ్ళిపోయాడు.

బండివాడు దుర్గమణి చూపించిన ట్రంకూ, దాని మీాద వున్న పక్కచుట్టా నెత్తిన పెట్టుకుని బైటకు వచ్చాడు. పెద్దకోడలూ, చిన్నకోడలూ అక్కణ్నుంచి గబగబా అడుగులు వేసుకుంటూ లోపలకు వెళ్లిపోయారు. దుర్గమణికూడా "-దుర్గా, దుర్గా" అంటూ గదికి తాళంవేసి పిల్లచేతిని పట్టుకుని వెళ్లి బండిలో కూర్చుంది. పిల్లకూడా మూర్ఛవచ్చిన దానిలా కళ్ళుమూసుకుంటూ, తల్లి హృదయాని కానుకుని పడుకుంది.

# 4

పన్నెండు సంవత్సరాలు జరిగిపోయింతర్వాత యీా నాడు దుర్గమణి హరిపాలెంలోని పుట్టింటికి తిరిగివచ్చింది. శరదృతువు సాయంకాలానికి దుర్గమణి పుట్టింటి పరిసర ప్రాం

తంలోనికి రావడంతోనే ఆమెకు గుబులు కలిగింది. యిప్పుడా యింట్లో చిన్నప్పటినుంచీ పెంచి, పెద్దచేసిన తల్లిగాని, తండ్రి గాని లేరు. అన్నగారు మాత్రమున్నారు. ఆనాటి సాయంకాలమే శంబుచటర్జీకి చలిజ్వరం వచ్చేరోజు. అందుకని సూర్యాస్తమయానికి ముందే ఆజ్వరానికి తయారై అతను మంచంలో పడుకున్నాడు.

యెవరో వచ్చారనే సంగతి తెలియగనే, వీభూది నొసట పెట్టుకొని- చెవులకు కుండనాలు ధరించి బైటకువచ్చి అగంతకులను గుర్తించి "-యెవరూ? దుర్గా యెప్పుడు బయలు దేరావమ్మాయ్-? మంచిది...రా...రా...!"అని అన్నాడు.

దుర్గమణి ముందుకువచ్చి యేడుస్తూ—యేడుస్తూ, పెద్దన్నగారికి ప్రణామం చేసింది. జ్ఞానదకూడా ప్రణామం చేసాక శంబుచటర్జీ "నీ కూతురేనా-? పెళ్లెక్కడ చేసావమ్మాయ్-?" అని అడిగాడు.

"యింకా పెళ్ళి చేయలేదన్నయ్యా! తొందర్లోనే, యెక్కడైన్నా..."

"ఆ!- ఆ పిల్లకింకా పెళ్ళి చేయలేదూ-? బాగా నేవుంది! యింకా చిన్నపిల్ల అనుకున్నావేమో! నీకూతుర్నింకా చిన్న పిల్ల అని పిలిచేసమయం దాటిపోయింది-" చాలా రోజుల్నుంచి శంబుచటర్జీ చెల్లెల్ని చూడకపోవడమూలాన, యిప్పుడామెమీద దయకలిగినా- అది ఒక్క ముహూర్త మాత్రమేవుండి తిరిగి శుష్కించింది.

"-అయితే వెంబడి పెద్ద గంద్రగోళం తెచ్చుకున్నా వన్నమాట!...యిక్కడి వాళ్ళకు యీ సంగతి తెలిస్తే యింకేమన్నా వుందా?——... సరే, వంట గదిలోకీ, దేవుడి గదిలోకీ, యీ పిల్లను రానీయకుండా వుంచాలి తెలిసిందా?—యీహరిపాలెంళ్లోని మనుష్యులు యెటువంటివాళ్లో నీకు తెలుసుగా-?యింత కుచ్చితమైన వెధవలు భారతదేశంలో యెక్కడైన్నా వుంటారా ..? రామ రామ...! సరే యింట్లోకి పద నువ్వుకూడా యింతపెద్దకూతుర్ని వెంబడి తీసుకరాకూడదు. దీన్ని పినతండ్రిగారి దగ్గర వదిలిపెట్టి వచ్చినట్లయితే నాల్గు రోజులపాటు, హాయిగా విశ్రాంతిగా వుండేదానివే!...-సరే తెలుసుకున్నావా-దుర్గా? సరే. లే...లే...ముఖం చేతులూ కడుక్కో! ఏమేయ్- యేం చేస్తున్నావు?" అని అంటూ లోపలికి వెళ్ళాడు. దుర్గమణీ, జ్ఞానదా ఆతని వెనుకాల యెలా వెళ్లారో అది భగవంతునికే తెలుసు?——

యిప్పుడున్నామె, శంబురెండో భార్య. దుర్గమణి అతని మొదటి భార్యను మాత్రం చూసింది! శంబురెండో భార్య శరీరంయెంత నల్లగా వుందో, అంతసన్నంగా- కొయ్యబొమ్మలావుంది. ఆమె అందాన్ని చూస్తుంటే ఆర్పిన కొరివి జ్ఞాపకానికి వస్తుంది.

మూడురోజుల్నుంచీ మురిగి నిలవవున్న పేడను పిడకలు కొట్టి, చేతులూ, కాళ్లూ కడుక్కొని, దీపం వెలిగించడానికి వెళ్తున్నదల్లా భర్తగారి పిలుపును విని వెనక్కువచ్చి, భర్తగారి వెనుక నిలబడివున్న యిద్దరి అపరిచితులను చూసి నిల

బడిపోయింది తనకు జ్వరం వస్తుందనే భయంతో, వచ్చి వాళ్లను భార్యకు పరిచయంచేసి, తగినట్లుగా మర్యాదలు చేయమని శంభుచటర్జీ గదిలోకి వెళ్లిపోయాడు.

శంభుభార్య పేరు 'భామిని'– కుటిలత్వంగా మాట్లాడే స్వభావం ఆమెది! నవ్వుతూ ఆమె తనపళ్ళ చిగుళ్ళను వాళ్ళ ముందు బైటపెట్టి, మరదలు దుర్గమణిని చేయిపట్టుకుని వెళ్లి చాపమీద కూచోపెట్టింది.

వదిన చేస్తున్న చేష్టలకూ, మాట్లాడేమాటలకూ దుర్గ మణికి వళ్ళంతా కంపరముకలిగించింది. ఆమె వచ్చేముందు తన వెంట ఓచిన్న తపేలానిండా రసగుల్లాలు తీసుకుని వచ్చింది. అవి బైటపెట్టి పెట్టడంతోనే, మొగపిల్లలూ–ఆడపిల్లలూ మిడుతల దండులా వచ్చి ఆమెను చుట్టుకున్నారు. వాళ్ళ అరుపులకూ గోలకూ ఆగది చిన్న బజారులా తయారైంది. ఆపిల్లలతల్లి ఒకళ్ళకు సగమూ, మరొకళ్ళకుషుమారుగా, యింకొకళ్లకు కొద్దికొద్దిగా పెట్టి వాళ్లనుపంపి– మిగిలిన రసగుల్లాలతో నిండిన ఆ తప్పేలాను తనపడకగదిలోనికి తీసుకుని వెళ్ళి వుట్టిమీద పెట్టింది. పిల్లవాళ్లుఅందినమటుకు గబుక్కున మింగి చేతికి తగిలివున్న రసాన్ని నాకుతూ నాకుతూ తమ తోవపట్టారు.

యిక్కడే పుట్టినందువలన ఆయింటి ఆచారవ్యవహారాలు దుర్గమణికి బాగా తెలుసు! వీధుల్లోనూ యిండ్లల్లోనూ యెనిమిదేండ్లపిల్లలు దిశమొలలతో తిరగడం జ్ఞానదకు సిగ్గుతోపాటు అసహ్యాన్ని కలిగించింది. ఆ వ్యవహారాలూ, అవీ.

జ్ఞానదకేమీ నచ్చలేదు. తనవూరుకూడా చిన్నపల్లెటూరే!- ఆపల్లెటూరికీ - యీ హరిపాలెమునకూ యెంతో వ్యత్యాస ముంది! తనవూళ్లోనడవటానికి దారులువుండడం- శుభ్రపరచడం వుంది. యిక్కడి లాగా మామిడి- పనస, దట్టమైన వెదురుచెట్లగుంపులను- వాట్లఆకుల్లో తడుముకుంటూ, అక్కడివాళ్లకు వెళ్ళవలసిన అవుసరంలేదు. కుళ్లికంపుకొడుతున్న పేడవాసన, నాల్గువేపులనుంచివచ్చి- శ్వాసప్రకోశాలను బంధించవు.

యింకా చీకటిపడలేదు. ఒకనక్క తలుపువద్దకు వచ్చింది. దాన్నిచూస్తూనే పెద్దపిల్లవాడు తరిమాడు. యింటి గోడకు ఆనుకుని వున్న, ఓచెట్టుకొమ్మమీదనుంచి, ఓ వికట శబ్దము జ్ఞానదకు వినిపించింది. అటువంటి శబ్దాన్ని జ్ఞానద యెప్పుడూ వినివుండలేదు భయపడుతూ భయపడుతూ- మెల్లగా "ఆ అరిచేదేమిటమ్మా-?" అనిఅడిగింది.

జ్ఞానద తల్లిని అడగడంవిని "అది పాము" అని భామిని జవాబుచెప్పింది·

జ్ఞానద కంపితురాలై "పామా? అయితే ఆ అరిచేది పామన్నమాట..." అనిఅడిగింది.

"అవునమ్మా- అదిపామే! యిక్కడి ప్రతిచెట్లనిండా కొమ్మకొమ్మకూ పాములునిండుంటాయ్" అని భామిని తిరిగిచెప్పింది·

భామిని నోటినుంచి ఆమాటలువిని, జ్ఞానద తల్లి ముహంలోకి చూసింది. అంతకంటేముందే, భయంతో-

హృదయాన్ని నింపుకున్నందువల్ల తల్లి వక్షస్థలంమీదకువరిగి వెక్కెక్కి-యేడుస్తూ "- యిక్కడ్నుంచిపదమ్మా!... యిక యిక్కడ నేనొక్క-క్షణంగూడ వుండలేను-" అనిచెప్పింది,

యీ యేడుపును చూసిభామిని ఆశ్చర్యంగా "-భయ పడడానికేముం దమ్మాయ్!- ఆపామేమో దేవతలాంటిది! యెప్పుడూ యెవరికీ అపకారం చేయలేదు. అయినా ఆయువు గట్టిగా వుండాలికాని, పాములు కరిచినంతమాత్రాన యెం తమంది చచ్చారమ్మా?- యేమీ ఫర్వాలేదు. యిక్కడున్న భయమల్లా ఒక్క మలేరియాదే! అదియెవర్నయినా పట్టు కుంటే,వాణ్ణిపూర్తిగా నిస్సారం చేయందే వదలదు. యిరవై రోజులనుంచి అది మీమామగారిని పట్టుకుని, వారిశరీరంలో ని రక్తమాంసాదుల్ని తిని- వందసంవత్సరాల వృద్ధుని మాది రిగా తయారు చేసింది... యిలానే రెండుమూడు సంవత్స రాలవరకూ పాతుకుని వుంటుందా- దీనిప్రభావం యింకా యెక్కువై తీరుతుంది. అప్పటికియిక్కడివాళ్లెవరన్నానోళ్ళల్లో యిన్నినీళ్ళు పోయడానికన్నా వుంటారో, వుండరో తెలవదు" అని అన్నది.

స్వర్ణమంజరితో పోట్లాడి యిక్కడికి వస్తున్నాడు- మలేరియా యిక్కడెంతయిదిగా విజృంభించివుందో అతు లుడు విప్పిచెప్పాడు. ఆసంగతి జ్ఞానదకిప్పుడుగుర్తుకు వచ్చింది భయంతో, నీరసంగా పడుకుని, రాత్రంతా జ్ఞానద ఒక్కక్షణ మయినా కన్ను మూయలేదు. తల్లిగుండెలవద్ద తలపెట్టుకుని పడుకునికూడా-వుండివుండి త్రుళ్లిపడేది. యిలానే తెల్లవారింది.

యింతపెద్ద అవివాహితు రాలయిన పిల్లనుచూసి, ఆవూళ్ళోనివాళ్ళంతా ఆశ్చర్య పడ్డారు! పెండ్లికాని పిల్ల వయసు బంగాళీయులు సరిగ్గా చెప్పరు... ప్రేమాస్పదు లైన తలిదండ్రులు ఒకటిరెండేళ్ళు తగ్గించి చెప్పడమలవా డని అందరికీ తెలుసు!- అటువంటి పరిస్థితుల్లో దుర్గమణి పదమూడు సంవత్సరాలు చెపితే, పదిహేనుకు తగ్గవని అంద రూ అనుకున్నారు. యింతకూ దుర్గమణికి. యీ ఒక్క పిల్లే కలగడంవలన తల్లీ దండ్రీ తాము తినకుండా పిల్లకు మంచి మంచి వస్తువులు ఆప్యాయంగా పెట్టేవారు. అందువల్ల జ్ఞానద నిగనిగ కాంతులతో నల్లగూపైనా మెరిసి పోయేది! ఆ మెరిసిపోవడమే తల్లికి యీనాడు బావుండలేదు. ఆమె సుందరమైన శరీరమూ, ఆలావూ- పొడుగూ చూసి- అంద గూ జ్ఞానదకు పదమూండుకంటే యెక్కువ వుంటాయనే నమ్మారు. నిజానికి పదమూండేలని- యెవరు విశ్వసిస్తారు?

యింకా రెండురోజులు గడచినయ్. మాటల సంద ర్భములో ఓనాడు శంభు- దుర్గమణితో - అమ్మాయ్, నీకూతురు వల్ల యీ వూళ్లో ముఖం చూపించ లేకుండా వున్నాను... యికలాభంలేదు. ఒక మంచికుర్రవాడు నా యెరికలో వున్నాడు వానికి జ్ఞానదనిచ్చి పెండ్లిచేస్తావా.?” అని అడిగాడు!

“ దీనికి వరుణ్ణి యిదివరకే నిశ్చయించామన్నయ్యా!- అతనికి తప్ప యింకెవ్వరికీ యివ్వకూడదని కూడా అను కున్నాము-”

"అయినా యేమీ ఫర్వాలేదమ్మా!... యీ పిల్ల వాడు నిజంగా పుణ్యం చేసుకుంటేనే దొరుకుతాడు. యిరవై యిరవయ్యైదు యెకరాలభూమీ, చెరువూ, తోటా ధాన్యపు గాదెలూ వున్నాయి. అదీకాక చదువుకున్నవాడు-"

మధ్యలోనే మాటను ఆపి దుర్గమణి- కాదన్నయ్యా? యింకెక్కడా దీనికి పెళ్లిచేయను. యీ సంవత్సరం గడిచాక, అక్కడే దీనికి పెళ్లిచేస్తాను-?" అని చెప్పింది.

"అంతదాకా దేనికమ్మాయీ- వచ్చే మార్గశిర మాసంలో పిల్లకు పెళ్లిచేద్దామని నేననుకుంటున్నాను-?"

దుర్గ యీవిషయములో అన్నగారితో వాదోపవాదులు చేయడం బాగుండదని యేదో పనిమీద బైటకు వెళ్లిపోయింది. క్రమక్రమంగా అన్నగారైన శంభు నిర్ణయించినవుడు, తనరెండో పెళ్లాం భామిని అన్నది మెల్లగా తేలింది.

ఆయనగారి భార్య చనిపోయింతర్వాత ఆరునెల్లపాటు బ్రహ్మచర్యం గడిపి- యిక యెక్కువకాలం యిలావుండలేనని ఆలోచించుకున్నాడు. పైగా ఆయనకు యింట్లో పిల్లాజెల్లావున్నారు. అందుకని యెక్కడ్నన్నా ఓ పెద్దపిల్లను చూసి పెండ్లిచేసుకుంటే,- అన్ని యిబ్బందులూ తీరిపోతయ్యని అతని నమ్మకం!

దుర్గమణి యిష్టంలేదనే అంటూవుంది. ఒకనాడు ఆయనవచ్చి విధివశాన జ్ఞానదను చూడ్డం తటస్థించింది· యిక ఆ పిల్లను వదల్లేకపోయాడు. అందుకు శంభుకూడా-"యెక్కువరోజులిక పెళ్లిచేయకుండా వుంచడానికి వీలులేదు. ప్రియనాథుని

తరువాత నేనే యీపిల్లను కన్యాదానం చేయాలి- తెలుసా దుర్గా!- వచ్చే మార్గశిర మాసంలో పెండ్లిచేస్తాను?''- అని కచ్చితంగా దుర్గమణితో చెప్పాడు.

అన్నగారితో పోట్లాడడం దుర్గమణికి యిష్టంలేక, లోపలికి వెళ్లిపోయింది. జ్ఞానదముహామూ- పువ్వుల్లాయెర్రగా వున్న ఆమె రెండు కళ్లూచూసి- శంబు తనతో అన్నమాటలు విన్నదని గ్రహించి దుర్గమణి జ్ఞానదను దగ్గరకు లాక్కుని "నేను బ్రతుకున్నంతకాలం నీకేమీ భయంలేదమ్మా!-'' అని అన్నది.

దుర్గమణి యీమాటేమోఅంది- అభయదానమేమో యిచ్చింది. కానీ, ఆమె హృదయం కూడా భయంతో వణికి పోయింది!- చుట్టుప్రక్కల వాళ్లల్లో బలవంతంగా పెళ్లిచేస్తా రని ఆమెకు తెలుసు!

తల్లి వక్షస్థలంమీద తలుంచి జ్ఞానద వెక్కెక్కి- యేడ్చింది. దుర్గమణి జ్ఞానద తలను నిమురుతూ-"జ్వరమెప్పుడు వచ్చిందమ్మా?'' అని అడిగింది.

'-నిన్న రాత్రి''

"అయితే నాకెందుకని చెప్పలేదు?- ప్రస్తుతం మలేరియా రోగం యిక్కడ యెక్కువగా వుందికదమ్మా...?''

జ్ఞానద మాట్లాడలేదు.

దుర్గమణి-అన్నభార్యను యెక్కువగా ఆకర్షిద్దామనే ప్రయత్నం చేయలేదు. భామిని వికృత శరీరమూ వికారపు నవ్వూ చూస్తేనే దుర్గమణికి వళ్లుమండి పోయేది! అదీకా

కుండా-, ఆమెకంఠస్వరం వింటేనే అసహ్యంచుకునేది! పల్లెటూరి పిల్లలలాకాకుండా భామిని పోట్లాటలకు ముందుకు దూకేది. అయినా ఆమె అనవసరంగా ఒకరిజోలికి పోదు, యెవరిదారిని వారువెల్తూవుంటే ఆమె అసలు మాట్లాడనేమాట్లాడదనీ, తనయింటి పనులేమిటో- తనేమిటో- తనపిల్లలేమిటో గాని, యింకొకరి జోలికి అనవసరంగా పోని ఓమంచిగుణముందని దుర్గమణి తెలుసుకుంది,

వచ్చిన క్రొత్తలో దుర్గమణి అన్నగారి భార్యకు సాయం చేద్దామని వంటింటిలోకి వెళ్ళింది- అప్పుడు భామిని "- రెండురోజులుండి వెళ్ళడానికి నువ్వొచ్చావు వదినా? నువ్వేపనీ చేయనవసరంలేదు. వంటపని నేను చేసుకుంటాను. వంటింటి లోకి నువ్వు రానవసరంలేదు వదినా-?" అని స్పష్టంగా చెప్పింది.

ఆ రోజునుంచీ దుర్గమణి తిరిగి వంటింటిలోకి రాలేదు. భోజనానికి చాలా ఆలస్యమైనందున యివాళ భామిని వంటింటి గుమ్మందగ్గరకు వచ్చి స్వభావసిద్ధమైన వికట స్వరముతో "- యివాళ భోజనం చేయవాయేమిటి- వదినా? వంటింటిలో యెంతసేపని కూచోను!-" అని అన్నది.

"పిల్లకుచాలాయెక్కువగా జ్వరంవచ్చిందివదినా?-మీరందరూతినండి. యివాళ నేనేమీతినను. జ్ఞానదకూడాతినదు-"

"పిల్లకు జ్వరమొస్తే పిల్లతినదనుకుందాం- యిప్పుడు నువ్వు వుపవాసంచేసేంత వుపద్రవం యేమొచ్చింది?- జ్వరమనేది అందరికీ రావడంలేదా?- లే. పద,"

"వద్దు వదినా! నన్ను అన్నంతినమని అడగకు. పిల్లను యీ అవస్థలో వదలిపెట్టి నేను నోట్లో ఓముద్దకూడా పెట్టుకోలేను-"

"నీ మాటలన్నీ చాలా విరుద్ధంగా వుంటాయ్- వదినా!" అంటూ భామిని వంటింటిలోకి వెళ్ళి "- జ్వర మొచ్చినట్లయితే వైద్యున్ని పిలిచి యేదయినా ఒకమాత్ర గాని, యింతచూర్ణం యిప్పించాలిగానీ, మలేరియాజ్వారానికి ఉపవాసం యెవరు చేస్తారు?... మావూళ్లో యిలా ఉపవాసాలుచెయ్యడం యెవ్వరూ నేర్చుకోలేదు." అని తనపనిలో నిమగ్నురాలైంది.

దుర్గమణి యీ మాటకు యేమీ సమాధానంచెప్ప లేదు. ప్రొద్దు యేటవాలుతుండగా,- ఒకగ్లాసును చేత్తో పట్టుకుని వదినగారు జ్ఞానదవద్దకు వచ్చి "- నీకోసం మందు తెచ్చాను జ్ఞానదా!- యిదిగో త్రాగు. మాత్రవికారంగా ఉంటుందని నీళ్ళలో కలుపుకుని వచ్చాను. లే- త్రాగు. త్రాగిం తర్వాత, అన్నంలో నీళ్లు పోసుంచాను, తిందువుగాని పద-" అని అన్నది.

భామినిని చూస్తేనే జ్ఞానదకు భయంకలిగేది అందుకని నోరుమెదపకుండా, గ్లాసులోని చేదుమందు కళ్ళుమూసుకొని త్రాగింది. కానీ, వెంటనే వాంతిచేసుకుని పడుకుంది. ఆసమయములో దుర్గమణి గదిలోలేదు. జ్ఞానద వాంతిచేసుకోవడంవిని, పరుగుత్తుకుంటూ వచ్చి- చూసి, నిశ్శబ్దురాలై నిలుచుంది. వదిన గారుకోపంతో బైటకువచ్చి, చుట్టుప్రక్క

లవాళ్ళను పిలిచి "- మహారాజుల యిండ్లల్లో వుండాల్సిన పిల్లను, మాబోటి దరిద్రులయింటికి యెందుకని తీసుక రావాలి?-" అని చెప్పడం మొదలు పెట్టింది.

జ్ఞానదజబ్బురోజురోజుకూ యెక్కువవుతూవుంది. దుర్గమణీ జ్ఞానదా, యిక్కడికి వచ్చిన మొట్టమొదటిరోజుల్లో భామిని "పాముకరిస్తే యెందుకు చస్తారమ్మా?- అదిఅసలు కరవనే కరవదు. యిక్కడ చచ్చేవాళ్ళంతా. మలేరియా జ్వరంతోనే చస్తూంటారు. అది ఒకసారిఒకళ్ళను పట్టుకుంటే యిక తొందరగా విడువదు" అని చెప్పింది.

యీ మాటల్లోని సత్యాన్ని నిర్ణయించుకోవడానికి ఆట్టేకాలం పట్టలేదు· మలేరియా జ్వరం జ్ఞానదను ఒక్కసారిగ చాపను అంటుకపోయేట్టు చేసింది.

ఆనాడు కార్తీక సంక్రాంతి. వదినగారు జ్ఞానదతలవద్ద కూచుని, ఆమెతల నిమురుతూండడం- దుర్గమణి గదిలో ప్రవేశిస్తూనే చూసింది. భామిని యిలాచేయడ్డం, దయ చూపడం, ఆమెకు క్రొత్తగానూ ఆశ్చర్యంగానూవుంది!- యింట్లోని పనులన్నిటినీ వదిలి, యెందుకూ పనికిరాకుండా యేహ్యాతనూ, జుగుప్సనూ, కలిగించే యీపనిని తనేస్వయంగా చేయడానికామె కేమాత్రమూ అవుసరంలేదు పైగాముక్కూ మొగమూ తెలియని పరాయిపిల్లకు యిలాసేవచేయడం ఆమె యెప్పుడూ నేర్చుకోలేదు. అటువంటి పరిస్థితుల్లో యీవిధంగా సేవచేస్తున్న ఆమె పనిలోని, ఓర్పుకు- దుర్గమణి ఆశ్చర్య పడింది.

ఒకప్పుడు అన్న- తన కూతురు వివాహపు విష యాన్ని గురించి ప్రసంగించడము గుర్తుకురాగానే, హృద యములో ఆమెకు బాణంలా గ్రుచ్చుకుంది. తన అన్నగారికి జ్ఞానదను యిచ్చిపెళ్లి చేయడానికే, ఆమె యీవిధంగాసేవలు చేస్తుందనీ, యిలాశాంతిభావాలను బైటకుప్రదర్శిస్తుందనీ, దుర్గమణి హృదయంలో మొదట్నుంచీవున్న అనుమానాన్ని బలపరిచింది.

దుర్గమణిని చూడడంతోనే, భామిని తనకంఠస్వరా న్ని కొద్దిగా తగ్గించి "- తారకేశ్వరంలో అనుభవనీయుడైన డాక్టరు ఒకడున్నాట్ట అతన్ని తీసుక రమ్మనమని మీా అన్నగారిని పంపించానమ్మా......! రోజురోజుకూ, పాపం జ్ఞానదకు జ్వరం యెక్కువవుతూ వుంది. అటువంటప్పుడు మనం యిలావూరికినే కూచోవడం యేమీా బావుండలేదు" అని అంది.

యీామాటకు దుర్గమణి యేదో అన్నదికానీ, భామిని కి వినిపించలేదు. యీా మంచివిషయాన్ని విన్నా,ఆమె హృద యంలో ఆనందము పొంగిపారలేక పోయింది.

భామిని యింటిపనులు చేసుకోవడానికి లేచి వెళ్లి పోయింది. జ్ఞానద తలగడక్రింద నుంచి ఒక కాగితాన్ని తీసి "-అతను వుత్తరంయిచ్చివెళ్లాడు-?" అని అన్నది.

"యేదీ- చూస్తాను," అంటూ తల్లి హాశావిడిగా వుత్తరాన్ని జ్ఞానద చేతిలోంచి తీసుకుంది. కానీ, చూడకుం డానే, చదవకుండానే వుత్తరాన్ని పిడికిలిలో గట్టిగా అదిమి

పట్టుకుని కూర్చుంది. ఒకసారి విప్పిచూస్తే బావుంటుం దేమో అని మనసు తహ తహలాడింది కానీ, ఆ విషయం ఓ క్షణంలో మాయమయింది." దీన్ని చదవకూడదు. యీ వుత్తరాన్ని పిల్ల నాకిచ్చింది. తల్లినై వుండి దీన్ని నేనెలా చదువను?" అని అనుకుంటూ "- యేమని వ్రాసాడమ్మా?" అని కూతుర్ని అడిగింది.

యీ మధ్యలో జ్ఞానద ఒక ప్రక్కకు వత్తిగిలి పడు కుంది. అలానే పడుకుని "- రావడం మంచిదికాదట...... అంతే-" అని అన్నది.

వుత్తరంలో వ్రాసివున్న రెండుపంక్తులూ విన్నాక, తల్లి కళ్ళు నీళ్ళతో నిండాయ్!"-రావడం మంచిదికాదు... అంతే-' ఆమె మనసులో-వాటిని మళ్ళీ అనుకుని, అతులుడు నాశనమవాలని మనసులో తిట్టుకుంది.

యీరెండు పంక్తుల్లోను- యెంత అభిమానం, యెంత మర్మాంతక వ్యథాఉన్నదో తెలవదు. యిక్కడికి వచ్చాక జ్ఞానదకు జ్వరమువచ్చింది . యిటువంటివి వస్తాయనే నమ్మ కంతో అతులుడానాడు వీళ్ళ ప్రయాణాన్ని ఆఖరిసారి చూసేం దుకు వచ్చానని వాళ్లతో చెప్పాడు...అదినిజమే!- "నేను స్వయంగా యేంచేసినా యెక్కడకువెళ్ళినా ఫరవాలేదు. కానీ పిల్లను తీసుకుని యిక్కడకు రావడం యేమీబాగుండలేదు. యెంతయిబ్బంది కలిగినా-యెన్నియిక్కట్లు వచ్చినా, అన్నీ సహించి అక్కడఉంటేనే బావుండేది-" అని దుర్గమణి అను కొన్నది.

ఆ పుత్తరాన్ని మమకారంతో చేతుల్లో యింకా అలానే పట్టుకుని వుంది. యెన్నో సంగతులు యివాళఆమెకు గుర్తుకు వచ్చినయ్!– భర్తగారు మరణశయ్యలో వున్నపుడు అతులుడు చేసిన ప్రతిజ్ఞ...!– తీర్థయాత్రనుంచి వచ్చి-అక్కడ కొనుక్కొనివచ్చిన మురుగుల్ని యివ్వడానికి, మహా ప్రసాదంఅనే వంకతో వచ్చిన సంగతి... ముఖ్యంగా– హరి పాలెం వచ్చేనాడు, అతులుడు అత్తయ్యతో పోట్లాడడం... కలకత్తానుంచి అతనెందుకు పరుగెత్తుక వచ్చాడో చుట్టు ప్రక్కల వాళ్ళు విన్నారు. అతని తల్లివింది. యివన్నీ గుర్తుకు రావడంతోనే–, ఆనందంతో, గర్వంతో-దుర్గమణిమాతృవక్షంపొంగిపోయింది "యీపిల్లనల్లని ఆకారం తోవున్నా– యీ నల్లదాని కెంతగౌరవముందో ఆయనగారు చూస్తే– బావుండు. కోయిలనలుపు... కందిరీగ నల్లగా వుంటుంది!" ఏమి కేమిటో మనసులో అనుకొని "–జ్ఞానదా? యిప్పుడెలావుందమ్మా?" అని పిలిచి అడిగింది.

"–బాగానే వుందమ్మా–!"

"యేమమ్మా–! అతులుడు నాసంగతి యేమన్నా వ్రాసాడా?"

" చదువమ్మా–!" అని జ్ఞానద అన్నది.

దుర్గమణి కుతూహలంగా కాగితాన్ని తీసుకుని కిటికీ వద్దకు వెళ్ళింది. యింత పెద్దకాగితంమీద రెండే రెండు పంక్తులా!– జ్ఞానద పొరపాటున ఒక కాగితానికి బదులు యింకో కాగితం యిచ్చిందేమో నని అనుకుంది. అయినా–

కాగితం విప్పి "-శ్రీ- చరణాలసన్నిధికి..." అని చదువుకుని మనసులోనే నవ్వుకుంది.... అయితే యీ వుత్తరం నాకే! -అందుకనే జ్ఞానద చదవడానికి నాకు యిచ్చింది. అని అనుకుని ఆఖరికి "- ఆవూరు మలేరియాకు పుట్టిల్లని నేనుచెప్ప లేదూ?- జ్ఞానదకు జ్వరం వచ్చిందనివిని- నేనుచాలా విచార పడ్డాను. ఆమెకు తొందరగా ఆరోగ్యం కలుగుతుందని ఆశి స్తాను!- మేమంతా కుశలంగా వున్నాము... నానమస్కా రాలు స్వీకరించాలి-" అని ఆమె చదువుకుంది.

జ్ఞానదకు యేమివ్రాసాడో-? అడగాలనికూడా వూరు కుని, చివరకు హృదయాన్ని చిక్క పట్టుకోలేక దగ్గరగా కూచుని, సంస్కారంలేని జుట్టు సందుల్లోంచి, వేళ్ళుపోనిచ్చి చిక్కుతీస్తూ- "అవునమ్మా! అతులుడు నీకు వ్రాసిన వుత్తరంలో, నీమీద యేమన్నా కోపంగా వ్రాసాడా?" అని అడిగింది.

విస్మయంతో జ్ఞానద "-యెక్కడి వుత్తరమమ్మా- నీ పేరుతోనే వ్రాశారుగా-?" అని అన్నది.

" నేనా వుత్తరాన్ని చూడనులే! వూరికే వినిసంతో షిద్దామని-"

"లేదమ్మా- ఆయన వృథాగా వుత్తరం రాయ డమ్మా-! ఆయన నీపేరుతోనే యీ వుత్తరంవ్రాసాడు." అని మళ్ళీ పక్కకు ఒత్తిగిలి పడుకుంది.

"రెండేరెండు పంక్తులా! వ్రాయడానికింకేమీ లేదూ?" అని విస్మయం పొందింది!- కూతురు వెంట్రుకల్లోవున్న ఆమె

చేతివేళ్ళు దేన్నో విచారణను చేస్తూవున్నాయ్!- చాలా సేపు అలానే కూచుని ఆమె లేచి వెళ్ళిపోయింది.

యీ విధంగానే రోజులు గడుస్తున్నాయ్!-

## 5

మార్గశిరపు మొదటిరోజులు, శారదా కాలపు చలి గాలి వీస్తూవుంది. దుర్గమణి తన చిన్నప్పటి స్నేహితురాలు అత్తగారింటివద్దనుంచి పుట్టింటికి వచ్చినదని విని, కూతురుకు కొంచెం నెమ్మదిగా వుండడంమూలాన్ని ఆమెను చూద్దామని బయలుదేరింది. తోవలో ఆమెకు పోష్టువాడు కనిపించడంతోనే- అతన్ని పిలిచి "- యేం దాసూ-! నావుత్తరాలు నాకు సరిగ్గా చేరడంలేదెందుకని?-" అని అడిగింది.

దాసు నవ్వుతూ -" యెక్కణ్నుంచికూడా వుత్తరాలు రానిదే, నీకెలా యివ్వనక్కాయ్-?" అని అన్నాడు.

"నాకుకాకపోతే, నా కూతురు జ్ఞానద పేరుతోనన్నా రావడంలేదా-?"

"వచ్చినట్లయితే- నేనే యిచ్చివెల్తాను"

"కాదుదాసూ, నువ్వు పోష్టుసంచి ఇంకోసారిబాగా చూడు...తప్పకుండా మాకు వుత్తరాలు రావాలి...మూడు వుత్తరాలకు కూడా జవాబులేదు. అతులుడు అటువంటివాడు కాడు-"

వూరికినే, అనవసరంగా మాట్లాడడం మంచిదికాదని, దాసు "-కాదక్కాయ్! నీకేమీ వుత్తరాలురాలేదు. వచ్చి

నప్పుడు నేను తప్పకుండా తెచ్చిస్తాను-" అని వెళ్ళబోతూన్న వాణ్ని ఆపి, దుర్గమణి "- అవును దాసూ? నావుత్తరాలు పోస్టాఫీసులో పడివుండొచ్చు. పోష్టుమాస్టరుకు నా పేరుగాని, నాకూతురు పేరుగాని, తెలియదుగా?- యే బల్లకిందనో పడేసి వుండొచ్చు! అది మీరెవరూ చూసుండరు. నన్నిక్కడి వాళ్ళంతా యెరుగుదురుగా!- అటువంటప్పుడు నేనుస్వయంగా ఒకసారి వెళ్ళి పోస్టాఫీసులో దేవుల్లాడుకోవచ్చా?-" అని అడిగింది

దుర్గమణి వ్యాకులపాటూ, ఆదుర్దాచూసి, దాసుకు జాలికలిగి "యెందుకు దేవుల్లాడుకోకూడదు. కానీ,- పోస్టాఫీసులో దేవుల్లాడ్డం అనవసరం!- సరే. నేను మళ్లీవచ్చేప్పుడు యింకోసారి బాగాచూస్తాను. దొరికినట్లయితే- యిచ్చి వెల్తాను." అని నిలవకుండా వెళ్ళిపోయాడు.

'ఓతల్లీ దుర్గాదేవీ... ఓ తల్లీ భవానీ... వుత్తరం వచ్చేటట్లు చేయండి!" అని దుర్గమణి దేవతలందరకూ మొక్కుకుని వెళ్లింది. జ్ఞానద యిటువంటి పరిస్థితిలో వున్నపుడు- తెలిసికూడా అతులుడు ఒక వుత్తరంముక్క వ్రాయడా? అని ఆమె నమ్మకం!

మానవుల నమ్మకాలకూ, ఆశలకూ-అంతుఉండదు!- యీామధ్య అతులుని మనసు మారిపోయిందని, వూహాలలోగాని, కలలోగాని, దుర్గమణి అనుకో లేదు!

దుర్గమణి, చిన్నప్పటి స్నేహితురాలిని కలుసుకుని తొందరగానే తిరిగివచ్చి కూతురువద్దకు వెళ్లి– "జ్ఞానూ! దాసేమన్నా వుత్తరం యిచ్చివెళ్లాడా?" అని అడిగింది.

"యివ్వ లేదమ్మా!... రెండునెల్లనుంచి యిప్పటికి మూడువుత్తరాలు వ్రాసినా, ఒక్కదానికీ ఆయన దగ్గరనుంచి జవాబురాలేదు"

"నువ్వు నిద్రపోయుంటావు! నాకు తెలుసు. దాసు నన్ను పిలిచేవుంటాడు. నువ్వు పలకకపోవడంతోనే అతను తిరిగి వెళ్లిపోయివుంటాడు. నేను యింట్లో లేనప్పుడు, నువ్వుకొంచెంసేపు మేలుకుంటే– యేప్రమాదమూ కలుగదుగా?–" అని ముఖం మాడ్చుకుని దుర్గమణి వెళ్లిపోయింది.

జ్ఞానద మెదలకుండా పడుకుంది! 'నేను నిద్రపోలేదు మేలుకునే వున్నా'నని చెప్పలేదు. తల్లి ప్రతినిత్యమూ కూతుర్ని యేసంగతులూ లేనట్లు ఆ ఒక్కసంగతే అడిగేది– జ్ఞానద చెప్పేదికూడా ఆ ఒక్కసమాధానమే!–

దుర్గమణి కూతురు గదిలోంచి బైటకువస్తూ, "అయితే దేవుల్లాడి యిస్తానని, దాసు నాకెందుకని చెపుతాడు?–" అని అన్నది. యివాల అతులుని దగ్గర్నుంచి వుత్తరం వచ్చివుండాలని ఆమె కెందుకో నమ్మకం!

కూతురు నోరు కదపలేదు. మురికిబొంతలో తలదాచుకుని, పడుకుంది. దుర్గమణి మేనల్లుని పోస్టాఫీసుకు పంపి– కనుక్కునేవరకూ శాంతించలేక పోయింది!

తరువాత నాలుగైదు రోజుల వరకూ వుత్తరంకోసం దుర్గమణి యెదురుచూసింది. రాత్రింపగళ్లు ముళ్లమీద పడుకున్నట్లు బాధ పడింది. కానీ- అతులుడు యే విధమైన వుత్తరమూ వ్రాయనందున ఆశాపూరితమైన ఆమె యెదురు చూపులు నిష్ఫలమైనాయ్!- నిరాశతో తిరిగి ఆమె అతులుని తల్లికి వుత్తరం వ్రాసింది. వెంటనే దానికి సమాధానం వచ్చింది. అతులుడు కుశలంగా వున్నాడనీ,— కలకత్తాలో చదువుకుంటున్నాడనీ అందులోవుంది.

చూస్తూ- చూస్తుండగనే మార్గశిర మాసముకూడా గడిచిపోయింది. పుష్యం దొర్లింది. కానీ,- అతులుని దగ్గర నుంచి వుత్తరమేమీ రాలేదు. మాఘమాసం గడిచాక కూతురుజబ్బునయమైంది. కానీ,- జ్ఞానదజబ్బు తల్లిని పట్టుకుంది. యీ నిరాశా ఘాతాన్ని, ఆమె సహించలేకపోయింది. అదీకాక అన్నభార్య భామినిని ఆమెపూర్తిగా ద్వేషించడం ప్రారంభించింది. యెప్పుడయినా మాటల సందర్భంలో ఆమె పేరు వస్తే- 'తాటకి' అని అనేది. రోజులెలా గడచిపోతున్నాయో- ఆ ద్వేషంకూడా అలానే గడచిపోతుంది.

'తాటకి' జ్ఞానద అందంగా వుంటుందని చాలాబాగా చూస్తూవుంది. జ్ఞానదమీద చూపుతున్న స్నేహం-ప్రేమా, మమతా, యివన్నీ ఆమె తన స్వార్థంకోసమేనని దుర్గమణి అనుమానపడి,- రోగంతో పోట్లాడుతూ, పోట్లాడుతూ మాఘమాసం చివర మంచ మెక్కింది. అప్పుడు జ్ఞానద యేడుస్తూ "-యిక యిక్కడ వుండడంయేమీ బావుండ లేదమ్మా!—

యింటికిపద!- జరిగేదేమిటో యికఅక్కడే జరిగి తీరుతుంది''-
అని అన్నది.

దుర్గమణికి కూతురు చెప్పిన సలహానచ్చింది. యిష్ట
పడింది. యిష్టపడడానికి కారణంలేకపోలేదు. యీ 'తాటకి'
సేవా- దయా- ప్రీతిపూర్వకమైనమాటలూ, యివన్నీకలసి
"- పారిపో!...యిక్కణ్నుంచి తొందరగా వెళ్ళిపో!'' అని
చెపుతున్నట్లుగా ఆమె హృదయాన్ని కలవరపరచినై!

దుర్గమణి ప్రయాణమవుతూందని- శంభువిని, మండి
పడి వుదయాన్నే యేడెనిమిది గంటలకు పావు కోళ్ళ టకటక
లతోవచ్చి "దుర్గా'' అని పిలిచాడు.

అరుగుమీద ఒక ప్రక్క స్థంబానికానుకొని దుర్గమణి
ముఖం కడుక్కొంటూ వుంది. జ్ఞానద దగ్గరగా కూచుని తల్లికి
సాయం చేస్తూవుంది. అన్నగారి పిలుపును విని ఆమె ఆయన
ముఖంవేపు చూసింది.

'యిటువంటప్పుడు నువ్వు వెళ్ళ కూడదు?' అని శంభు
అన్నాడు.

"యెందుకని అన్నాయ్....-?''

"యెందుకన్నాయ్?- యెందుకేమిటి- నీకోసం, నే
నన్నమాటను తప్పి అబద్ధీకున్నానమంటావా- యేం? యీ
బొందిలో ప్రాణముండగా నేనబద్ధం చెప్పను తెలుసా?-''

అసలు సంగతేమిటో దుర్గమణి తెలుసుకో లేక
పోయింది. అందుకని "- అసలు సంగతేమిటన్నాయ్-?'' అని
ఆమె మళ్ళీ అడిగింది.

"అదే... జ్ఞానద పెళ్లి సంగతి! అప్పుడే మర్చి పోయావా?- దానికింకా పెళ్ళిచేయకుండా వుంచను. పాపం, తండ్రా లేడాయె!- యిక నేనన్నా చూడకపోతే యెలా?- అందుకని ఫాల్గుణ పంచమినాడు నవీనునికిచ్చి పెళ్ళిచేయాలని నిశ్చయించాను. పిల్లకుసామ్యా అదీయివ్వడానికి సిద్ధంగా వున్నాడు. యిటువంటి పెళ్లి సంబంధం మనకిక దొరుకదు తెలుసా?-"

ఆ సంగతి వినడంతోనే దుర్గమణి నెత్తిన పిడుగు పడి నట్లయింది. కళ్ళనిండా నీళ్ళు తెచ్చుకొని "- నన్ను అడగందే మాటెందుకిచ్చావన్నాయ్!?- యీ పెళ్లి నాప్రాణమున్నంత వరకూ చేయనీయను-" అనిఅన్నది.

"నువ్వుపోయాక కూడా చేయనీయవాయేం?- నేను దీనికి మేనమామను... నేనేదిచెప్తే అది జరిగితీరాలి. నీకోసం నామాటనుపాడు చేసుకోమంటావా?- బాగానేవుంది?"

దుర్గమణి యేడుస్తూ "- కాదన్నయ్యా! నేను బ్రతికుండగా పిల్లకిక్కడ పెళ్లిచేయను. నాకోసం నువ్వు విచార పడ నవుసరంలేదు-" అని అన్నది.

దుర్గమణి కంఠం యేడుపుకు బొంగురు పోయింది. చెప్పాలనుకున్న మాటను ఆమె పూర్తి చేయలేకపోయింది. శంభు కోపంతో, మండిపడుతూ- పళ్ళు కొరుకుతూ "- శుభ కార్యాలలో వెధవేడుపు యెందుకేడుస్తావు యేది జరగదని నువ్వంటున్నావో అది నేను చేసితీరుతాను- తెలుసా?" అని అన్నాడు.

పిడకలు చేసింది కామోలు,- రెండు చేతులనిండా భామిని పేడచేసుకొని అక్కడకు వచ్చి, భర్తవేపుచూసి, ఘనఘన చప్పట్లుచరుస్తూ "- సరే! యింతకూ ఆ వుత్తమ వరుడెవరో, నేను వినవచ్చా-?" అని అడిగింది.

భార్య రూపవైఖరిచూసి శంబు స్థబ్దుడయ్యాడు!- అయినా అతనేమీ భయపడకుండా "-యెవరైతే నువ్వేం చేస్తావు?" అని అన్నాడు.

పేడతోవున్న చేతుల్ని తిప్పుతూ- కొంచెంసేపు నాట్యంచేసి, తనమృధుమధురమైన గొంతుకతో యింట్లోని వాళ్ళను చకితుల్నిచేస్తూ "- మామ! మేనమామ! మామత్వాన్ని చూపడానికి వచ్చావా? వందరూపాయిలు, వడ్డీలో పెరుగకుండా నోటు రద్దు పరచుకుంటానికి, నవీనుని కిచ్చిపెళ్లి చేద్దామనుకున్నావా?... అందుకనేనా వుత్తమవరుడు-? అదా సంగతి?... యింతకూ నవీనుడు నాస్వంతఅన్నగారని నాకు తెలువదూ?- అమ్మపుట్టిల్లు నాదగ్గర్నా?- బలేబాగుంది. అయిదుగురు బిడ్డల తల్లైవుంది, వాడిభార్య యెనిమిదినెలల గర్భిణితో వున్నప్పుడు, కల్లూ, గంజాయినిషాలవల్ల కడుపు మీదకొట్టి చంపి లేకదూ- ఆమెచచ్చిపోయింది, అందుకేనా వాడు వుత్తమ వరుడయింది! అటువంటివాడు యింకెవరూ లేరన్నమాట!- యేమీ తెలియని యీపిల్లమెడకు వురి తగిలించదలచావన్నమాట!- యెవరన్నా వింటే యేమంటారు? సిగ్గుచేటు...... సిగ్గుచేటు .." అని అన్నది.

చెల్లెలు ముందూ, మేనకోడలిముందూ, తనకోపాన్ని సంబాళించుకోలేక, కాలికున్న పావుకోడు చేత్తో పట్టుకుని "-నోరుమూయ్- సంకరపుముండా?-" అని అరిచాడు.

తాటకి వూరుకోక "- ఆ! నన్ను సంకరపుముండ అని అంటావా? యింకెప్పుడైనా యిటువంటి మాటలంటే కాలుతున్న కర్రనునోట్లోపెట్టకపోతే, నేను పంచుఘోశాల్ కూతుర్ని కాను... బలవంతంగా యీపిల్లకు పెళ్లిచేస్తావా?- యిలాబలవంతంగా చేయడానికి నువ్వెవరివి? రెండు రోజుల పాటు సుఖంగా వుందామని ఆమెయిక్కడికి వస్తే,- రాత్రిం పగళ్లు ఒకటేసాధింపా?-" అని అరిచింది.

ఆభయంకరమైన, ఆకృతిముందు- శంభు యింకేమీ మాట్లాడకుండా, లోపలకు వెళ్ళిపోయాడు.

భామిని దుర్గమణివేపుచూసి "-ఆయన మాదిగవాడి తోసమాన మొదినా! మీరుయిక్కడికి వచ్చినప్పట్నుంచీ యీ యేర్పాటు చేస్తూవున్నాడు. అందమయిన యీ బం గారు బొమ్మను, ఆదరిద్రపుకోతి చేతుల్లో పెట్టి ఋణవిము క్తుడై, తాకట్టున్న పొలాన్ని విడిపించుకుందా మనుకున్నాడు లావుంది.... పైగానేను మేనమామను... మేనమామనని అంటాడే!" అని కొంచెంసేపువుండి "- నీతో యింతవరకూ యెందుకులే అని చెప్పలేదు వదినా!- జ్ఞానద జ్వరంతో సత మతమౌతుంటే, వెళ్లి యెక్కడనన్నా డాక్టరుని తీసుకరాండి- అని నేనంటే, 'నాదగ్గర డబ్బేమీలేదు' అనివూరుకున్నాడు. చూడలేక నా రెండు వెండికడియాలు తాకట్టుపెట్టి డాక్టర్ని

పిలిపించాను.... కొద్దిగ కులాసా కలిగిందో లేదో, నాయిష్టం వచ్చినట్లు చేస్తానని పెద్దగా ధాంధూంలు చేస్తున్నాడు!- పిల్లకు డబ్బిచ్చి నయంచేయడానికి మేనమామ కాదు గాని, బలవంతంగా పెళ్లిచేయడానికి మాత్రం మేనమామట!- మేన మామ!! సిగ్గులేదూ?- నేను బ్రతికున్నంతకాలమూ మీాకే మీా ఫర్వాలేదు వదినా! మీా యింటికి వెళ్లి, పిల్లకు నచ్చిన వాణ్ణి తెచ్చి పెళ్లి చేసి తీసుకురా!- తరువాత నీకిష్టం వచ్చి నప్పుడువచ్చి- నీయిష్టమున్నంతకాలంవుండు-" అనిఅన్నది.

దుర్గమణి ఆశ్చర్యంగావింటూ, అలానే స్తంభానికి ఆను కుని కూచుంది. ఆమె రెండుకళ్లల్లోనూ, నీళ్లు తిరిగినయ్!

'తాటకి'- తనకంఠాన్ని కొంచెం తగ్గించి గొణుగుకుం టున్నట్లుగా- "అనాథలమీాద బలవంతాన్ని ప్రయోగించి, దౌర్జన్యం చేస్తే- పైన భగవంతుడులేడూ?- యిలా చేసే వాళ్లను భగవంతుడు క్షమించడు-" అని భర్తగారి నుద్దే సించి అన్నది.

ఆనాటి మధ్యాహ్నం ప్రయాణానికి దుర్గమణి, జ్ఞానదా సిద్ధమయారు.

యెద్దుబండి యెక్కేముందు, దుర్గమణీ- భామిని రెండు పాదాలమీాదా పడి- కన్నీళ్లతో "వదినా!- నువ్వు నిజంగా వదినవే! నేను నీకు ఆశీర్వాదమివ్వడానికి తగిన దాన్నికాదు. అయినా,- భగవంతుడు నిన్ను కరుణతో కాపాడమని వేడు కుంటాను. నా, సం నువ్వు నీచేతులునున్న కడియాలనుకూడా ఖర్చుపెట్టావు-" అని అన్నది.

భామిని తనపండ్లన్నీ కనుపించేలా నవ్వుతూ- "కడియాల దేముందిలే వదినా! యీగాజులూ, నొసటిబొట్టూ- చిరకాలముండేలా నువ్వాశీర్వదించితే చాలు. ఓపిక లేకుండా నువ్వలా నిలుచోవద్దు వొదినా- వెళ్లిబండిలో కూర్చో!- జ్ఞానదా! అత్తమామల యింట్లో నువ్వెన్నో కష్టాలు పడ్డావు- అవన్నీ మరిచిపో అమ్మా!- యెప్పుడయినా యీ అత్తను చూడ్డానికి మరిచిపోకుండా రా...!" అని అంటూ జ్ఞానద చేతిలో రెండురూపాయలను పెట్టింది.

బండివాడు బండిని మెల్లిగా సాగనిచ్చాడు. దుర్గమణి కన్నీళ్లు తుడుచుకుంటూ- "తెలిసీ తెలియక నిన్నెంతో కష్టపెట్టాను వొదినా!- నాతప్పుల్ని క్షమించు-" అని అన్నది.

భామిని కంటినీరు తుడుచుకుని- "మేమే మీకు కష్టాలు కలుగచేసాము...జ్ఞానదా, అత్తమామలమీద కోపంవుంచుకోకమ్మా! వచ్చే మామిడి, పనసకాయలు కాచేరోజులనాటికి నీభర్తతో నువ్వు కలిసిరావాలి...ముందే చెపుతున్నాను. మరిచిపోకు" అంటూ- మళ్లీ కన్నీళ్లు తుడుచుకుంది.

తాము తిరిగివస్తున్నామని మరిదిగారికి వ్రాయనవసరం లేదనుకుని దుర్గమణి తనవూరు వచ్చేసింది. జ్ఞానదముఖం చూస్తూనే, పెద్దమ్మ నవ్వుతూ...నవ్వుతూ- "యేం జ్ఞానదా? నీరెండు బుగ్గల్ని మెలిపెట్టి యెవరు సాగదీసారు?...బాబో- యీ ముఖం యింతయిదిగా చెడిపోయిందేం-? ఆ తలవెంట్రుకలు అలాపూడిపోయాయెందుకు?- ఓ దేవరాణీ- యిటుతొం

దరగారా!- ఒకసారి జ్ఞానదను వచ్చి చూసెళ్లు..." అని చిన్న కోడలిని పిలిచింది.

వ్యంగ్యముతో కూడుకున్న యీ మాటలకు జ్ఞానద జవాబేమీ చెప్పలేదు. ఆమె తలవంచుకు నేకూచుంది. పిన తల్లి దేవరాణి యింట్లోకి రావడంతో నే, కూచున్నదల్లా జ్ఞానద గబుక్కున లేచి ఆమెకు ప్రణామంచేసింది.

పినతల్లి కంపిస్తూ!-" యిలాఅయా వేమమ్మా?-" అని ప్రేమగా అడిగింది.

"వెదురుచెట్లల్లో వుండే తెల్లదెయ్యంలావుంది. రాత్రు లు చూస్తే తప్పక జడుసుకుంటారు-" అని కిలకిల నవ్వుతూ, పెత్తల్లి అన్నది.

జీర్ణమై శుష్కించిపోయిన అవయవాల్ని పాలిపోయిన వంటినీ చూసి పినతల్లికి, మాతృహృదయం బద్దలైనట్లయి స్వర్ణమంజరి నవ్వుల్లో భాగాన్ని పంచుకోలేక పోయింది!

పినతల్లి- జ్ఞానదదగ్గర కూచుని ఆమె ముఖాన్నీ, వంటినీ,తలనీ చేత్తో నిమురుతూ-జ్ఞానద జబ్బుపడిన సంగతి విని "- అయితే, నువ్వప్పుడే యెందుకు రాలేకపోయావమ్మా!- మీరు యిక్కడికి రావడానికి, నేనేమీ వద్దన లేదుగా!— అక్కాయ్ యేదీ...?" అని అడిగింది.

"అమ్మకు బండిలోనే జ్వరంవచ్చింది. ఆమెనుఇంట్లో పడుకోపెట్టాను-"

"జ్వరంరాదూ, మరి- జ్వరంరాదూ? నేనీయింటికి పెద్దకోడల్నిగదా- నన్నే వ్యతిరేకించి గర్వంతో పుట్టింటి

వెళ్తే, అక్కడమాత్రం సుఖంగా వుంటుందా-?" అని స్వర్ణ మంజరి అన్నది.

దుర్గమణిని చూద్దామనే కుతూహలంతో చిన్న కోడలు లేచింది. పెద్దకోడలు యీవిధంగా జ్ఞానదనూ, ఆమె తల్లినీ, సూటిపోటిమాటలతో అనవసరంగా దెప్పిపొడవడం చిన్నకోడలకు అసహ్యంగాతోచి, సహించలేక "-అక్కాయ్! నువ్వురెండు సంవత్సరాలవరకూ ఏమేదయినా వర్తించేస్తే, వచ్చే జన్మలో నైనా నీనోరు బాగుపడేయోగం దొరుకుతుంది" అని చెప్పింది.

స్వర్ణమంజరి- తన విషయంలో చిన్నకోడలు యీ విధంగా అంటుందని ఆమెయెప్పుడూ అనుకోలేదు. అకస్మాత్తుగా యీ మాటలు విని ఆమె, ఆశ్చర్యంతో "-అయితే మంచిదేచెల్లీ!- మంచిదే! యిన్నిరోజులకి నీకురెండో కోడలు కనుపించినదన్నమాట!-అమ్మయ్యో!- యెంతమాయలాడివి" అని అన్నది.

చిన్నకోడలు జవాబేమీ చెప్పలేదు. జ్ఞానదచేయి పట్టుకుని తిన్నగా వాళ్ళ యింట్లోకి వెళ్ళిపోయింది. పినతల్లి ఆవిధంగా వ్యవహరించడం జ్ఞానదకు ఆశ్చర్యాన్నీ, భయాన్నీ కలుగజేసింది.

హరిపాలెంలో వున్నంతకాలం దుర్గమణికి జ్వరంవచ్చినంతసేపూ పడుకుని- తరువాత లేచి తిరుగుతూ వుండేది. ఆరోగ్యం బాగావున్నప్పుడు స్నానం, పూజా-చేసి, కొద్దిగ యెంగిలికూడా చేసేది. కాని యిక్కడికి వచ్చాక స్థితిగతులు

యింకోమాదిరిగా మారిపోయినై!- పల్లెటూరిలోని ఆడవా ళ్ళందరూ, ఆమెకు సానుభూతిని చూపడానికి వచ్చి, నాలు గైదురోజుల్లోనే ఆమెను చాపమీదకు వచ్చేట్లుచేశారు.

నీలకంఠ ముఖర్జీ భార్య, దుర్గమణిని చూడడానికి వచ్చి, ఒక్కసారే- "యేం దుర్గా! నీపిల్లకు యింకెంత కాల మని పెళ్ళి చేయకుండా వుంటావ్?-యెవరి వేపూ చూడడానికి వీలులేని వయసు వచ్చిందే-?" అని అడిగింది.

అలసిపోయిన తనరెండు కళ్ళను మూసుకొని- క్షీణిం చిన గొంతుతో "యింకా యేసంబంధమూ కుదరలే దత్తాయ్-? మామీద భగవంతునికి యెప్పుడు దయకలుగు తుందో-?" అని అన్నది.

"ఆ సంగతి నాకూ తెలుసమ్మా!- అయినా మనం ప్రియత్నం చేయాలిగా- భగవంతుడు పెళ్ళికొడుకును వెదికి తెస్తాడా?"

ఆ మాటకు దుర్గమణి జవాబు చెప్పలేదు

ఒక నిమిషమూరుకుని ఆమె మళ్లీ "-నువ్వు పుట్టింటికి వెళ్లావుకదా- మీ అన్నయ్య యే సంబంధమూ చూడ లేదా-?" అని అడిగింది.

"భగవంతునికి తెలుసు." అని దుర్గమణి యింకో వేపుకు తిరిగి పడుకుంది.

గంట గడచిం తర్వాత ఆమె మళ్ళీ వచ్చి- గడపలో నుంచే "-వంట్లో యెలావుంది దుర్గా!" అని అడిగింది.

పక్కమీద ఓఅంచున కూచున్న జ్ఞానద 'జ్వరమింకా తగ్గలేదత్తా' అని అన్నది.

ముఖంతిప్పిచూసి, దుర్గమణి "-కూర్చోవదినా!" అని అన్నది.

"కాదువదినా- చాలాఆలస్యమయింది. కూర్చోమని అనకు! కానీ, ఒకసంగతి- యికయెవరినో ఒకరినిపట్టుకొని పెళ్లిచేయ్-! మంచిచెడ్డలు విచారించడం యెంతైనామంచిది. యింకోసంగతి, యిదివరకు యీపిల్లవళ్ళు కొంచెం అందంగా వుండేది! మలేరియావల్లయిప్పుడు కోయిలరంగైంది. యికనైనా జాగ్రతపడకపోతే లాభంలేదు. యేంజ్ఞానదా!- నెత్తిమీది వెంట్రుకలుకూడా వూడిపోయాయేం?"

జ్ఞానదమెడవంచి అలానేకూచుంది. ఆమెమళ్ళీ "ఆ వీధిలోవుండే గోపాల్ భట్టాచార్యుడు మళ్ళీపెళ్ళిచేసుకునే ప్రియత్నంలో వున్నాడట! ఒకసారి మీమరదిగారిని పంపి, సంగతెందుకు తెలుసుకోవు?" అని అడిగింది.

"సరే- అడుగుతాను" అని దుర్గమణి నిట్టూర్పువిడిచి గోడవేపుచూస్తూ పడుకుంది.

యీవిధంగా ఆమెకు యెంతమంది బోధించారో, లెక్కేలేదు!- యెవరికోసం ఆమెచెవులు నిక్కపొడుచుకుని చూస్తూవున్నాయో-అతని అడుగుజాడే వినపడలేదు.

అతులుడు రానూలేదు, చివరకు అతనితల్లికూడా చూడనైనాచూడలేదు!

చిన్నకోడలికి, జాలీ, దయా, ప్రేమా, తెలుసు. కానీ, ఆమెకు సోమరితనంయెక్కువ. యిప్పుడామెగర్భవతి. యీ కారణంవల్ల స్వర్ణమంజరి జ్ఞానదను పిలిచి "అమ్మాయీ, యెప్పుడూ జబ్బుతో మూలపడుకుని వుంటేపనికాదు. మీ అమ్మకూడా యిప్పుడేమీచేయలేదు. నువ్వుపెద్దదానివి మాత్రమయ్యావు యేంలాభం? మీబాబాయికి ప్రొద్దున్నే భోజనంవండిపెట్టగలవా?–" అనిఅడిగింది.

యీ మాటలన్నీ తనగదిలో వుండి, చిన్నకోడలు విని చాలాఅన్యాయం జరుగుతూందని అనుకుందికానీ,– ఆమె యేమీమాట్లాడలేదు. యితరులుపడే బాధనుచూసి ఆమె వ్యథపడుతుందికానీ,– ఆబాధలనుతొలగిద్దామని ప్రయత్నించే శక్తి– తాహతు ఆమెలో లేదు.

"నేనువండిపెడుతాను లే, పెద్దమ్మా," అని జ్ఞానద అన్నది.

ప్రతిరోజూ రాత్రిలపూట జ్ఞానదకు జ్వరంవస్తూనే వుంది- తనకింకా జ్వరంవస్తుందనితల్లికి తెలిసినట్లయితే– ఆమె యింకా దిగులుపడుతుందని చెప్పకుండానే, మనసులోవుంచుకుంది. రక్తమాంసాదులులేని తనశరీరాన్ని, ప్రొద్దున్నేపక్కమీదినుంచి బలవంతంగా లాక్కుని, లేవలేకపోయినా, పెద్దతల్లికిమాత్రం తెలియనిచ్చేదికాదు! ఒక్కమారైనా అసంతృప్తిని తనముహంమీద కనుపించనీయలేదు.

దుఃఖితులైన తలిదండ్రులకు ఒక్కతేకూతురవడం వలన, జ్ఞానదచాలా జాగ్రత్తగా పోషించబడింది. యెంతో

ప్రేమతో పెంచిపెద్దజేసినా జ్ఞానదస్వతంత్రాలు కాలేక పోయింది. చిన్నప్పటినుంచీ, పెద్దలమీదా- గురువులమీదా భక్తివుంచి, శ్రద్ధతో సేవజేస్తుండే అలవాటునేర్చుకుంది. పైగా- యెవరుయెన్నిమాటలన్నా, తలవంచుకొని ఓర్పుతో సహించేగుణం ఆమెలో లీనమయింది. కానీ-, యీనాడు దుర్బలశరీరంతో ఆమెయెంతటిబరువును మోస్తూ, అణగారి పోతుందో, యెవరూ తెలుసుకోనప్పటికీ, పినతల్లి దేవరాణి గ్రహించి పెద్దకోడలు స్వర్ణమంజరిమీద ద్వేషభావం కలిగినా-ఆమెనుయేమీ అనలేకపోయింది.

రెండోనాడు పినతండ్రి స్నానంచేసి లోపలకువెళ్ళడం చూసి- జ్ఞానద, పళ్ళెంలో అన్నాన్నివడ్డించుకుని ఆయనకు పెట్టాలని వెల్తూవుండగా,- యింతలోనే పెద్దమ్మ యెక్కడ్నుంచో "-ఆ... ఆ..." అంటూ పరుగెత్తుకవచ్చి "యెక్కడికి కెల్తున్నావే జ్ఞానదా?" అని అడిగింది.

భయపడుతూ జ్ఞానద "బాబాయి స్నానంచేసి వచ్చాడుగా!-" అని అంది.

"స్నానంచేసివస్తే,-ఆయనకు నువ్వేంచేయాలి?" అని గొంతుకచించుకొని "- భోజనంవడ్డించుకుని ఆయనముందుకు నిన్నెళ్ళొద్దని చెప్పలేదూ!- నీకేమైనా బుద్ధుందా?- నువ్వు వడ్డిస్తే మగవాళ్లెవ్వరైనా తింటారా?" అనిఅడిగింది.

ఆసమయాన్నే దుర్గమణిలేచి గుమ్మంలో కూచుని యీమాటలన్నీ విని భయపడింది.

గదిలోంచిబైటకు వచ్చి చిన్నకోడలు "- యేంజరిగిందేమిటక్కాయ్?" అనిఅడిగింది.

యెటువేపూ దృష్టిమరల్చకుండానే స్వర్ణమంజరి సిటారుగా నిలుచుని పిల్లను బెదిరిస్తూ "వడ్డించిన పళ్ళాన్నితీసుకవెళ్తే, నీబాబాయి సంతోషించి నెత్తిన కూచోపెట్టుకొని, గంతులు వేస్తూ యెక్కణ్నుంచైనా రాజకుమారుణ్ణితెచ్చి నీకు పెళ్ళిచేస్తాడనుకున్నావా?- అమ్మయ్యో!... యింతచిన్నపిల్లకు అప్పుడే యెంతెంత బుద్ధులున్నాయ్!" అని స్వర్ణమంజరి జ్ఞానదచేతిలోని పళ్ళాన్ని లాక్కుని వెళ్ళి పోయింది.

దుర్గమణి అసలే- ప్రతిరోజూ యెన్నోకాలాన్నలతో మండుతూవుంటుంది. పిలనుచూస్తూ, యేడుస్తూ ఏడుస్తూ "- మాడుముఖందానా! పెద్దలుచెప్పేమాటలు వినకపోతే చావకూడదూ?" అని అంది.

జ్ఞానద నోరుమెదపకుండా వంటింటిలోకివెళ్ళిపోయింది.

స్వర్ణమంజరికి విరుద్ధంగా మాట్లాడదలచుకుంటే-ఒక్క చిన్నకోడలే మాట్లాడాలి!. పెద్దక్కగారి స్వభావము ఆమెకు తెలుసుగాని, నోరుచేసుకొని మాట్లాడే శక్తి ఆమెకు లేదు.— చిన్న కోడలు జ్ఞానదవెనుకాలె వంటింటిలోకివెళ్ళి,- ఆమెను బుజ్జగిస్తూ "- పెద్దమ్మమాటల్ని యెందుకని వినవమ్మా?" అని అడిగింది.

జ్ఞానద ఒక్కసారి దేవరాణివేపుచూసి, ఆమె కాళ్ళమీదపడి "- బాబాయికి, పళ్ళెంలోఅన్నంపెట్టి తీసుకవెళ్ళ

గూడదని నాకెవరూ చెప్పలేదు పిన్నీ" అని వెక్కెక్కి యేడ్చింది.

యేమని చెప్పి ఆపిల్లహృదయాన్ని సంతోషపెట్టాలో తెలుసుకోలేక దగ్గరగా కూచుని చిన్నకోడలు జ్ఞానదకన్నీళ్లు తుడిచింది.

## 6

ప్రస్తుతం దుర్గమణి శరీరం చాలానీరసించిపోయింది. సహాయంలేనిదే లేవలేనంతబలహీనం యేర్పడింది. జ్ఞానదతప్ప ఆమెకు సేవా శుశ్రూషలు చేసేవాళ్ళెవరూ లేరు. యెన్ని పనులున్నా, యేదోఓసమయంలో వీలుచూసుకుని జ్ఞానద ఆ గదిలోకివచ్చి తల్లిదగ్గర కూచునేది. అలానేయిప్పుడు కూడా వీలు చేసుకొని జ్ఞానద తల్లిదగ్గరకూచుని వీపుపట్టుతూవుంది. కొంతసేపయినతరువాత హఠాత్తుగా తనకుపరిచయమైన కంఠస్వరంవిని, ఆమె హృదయం గాబరాగా కొట్టుకుంది.

హోలీపండుగ శలవలకుఅతులుడుయింటికివచ్చాడు. అతనివెంబడి యింకా నలుగురైదుగురు చుట్టుప్రక్కలవుర వాళ్ళున్నారు. అందరి వంటికీ, బట్టలకూ-రంగు పూయబడి వుంది. రంగుతో జేబులు నింపుకొని అతులుడు గట్టిగా 'అత్తయ్యా' అని లోపలకు వెళ్ళాడు.

జబ్బుతో వుండడం వలన దుర్గమణికిప్పుడు నిద్రసరిగ్గా రావడంలేదు. యెప్పుడన్నా ఆమెకునికిపాటుపడేది. యిప్పుడూ అలానే కునుకుతూవుంది. యీ కంఠస్వరంవిని తల్లెక్కడ

లేస్తుందోనని జ్ఞానద భయపడింది. తనతల్లి యెవరికోసం యింతవరకూ యెదురుచూస్తూ నిరీక్షించిదో, అతను యిక్కడికి రాకుండా-తన పెద్దమ్మగారింట్లో కేరింతాలుకొడుతున్నాడు. యీప్రతీకార విఘాతము ఆమె అశనూ, ఓర్పునూ నాశనము చేసి, యేమూలో ఒదిగిచూస్తున్న యీర్ష్యను రేకెత్తించి, అతులుణ్ని చూడడంతోనే పోట్లాటకు దారితీయిస్తుందని జ్ఞానద అంతర్యామి చెపుతూనేవుంది.

యే విధంగా యీఆపదను తొలగించుదామా,- అని జ్ఞానద ఆలోచించి-బరువైన తనపాదాలను, మెల్లగా లేవదీసుకొని తలుపు గడివేస్తున్నపుడు 'యేం జ్ఞానదా! ఆ మాట్లాడేది అతులుడేనా?' అని తల్లిఅడిగింది.

తలుపుదగ్గర్నుంచి వెనక్కువచ్చి "యేమోనమ్మా! నాకు తెలియదు. ఆయనకాడేమో?" అని జ్ఞానద అన్నది.

"-అయనకాడూ?... అతనే-లేచి ఒకసారిచూసిరా?"

యెదురు జవాబుచెపితే తల్లికోప్పడుతుందని జ్ఞానదకు తెలుసు! మాట్లాడకుండా ఆమెలేచి, మెల్లమెల్లగా వెళ్ళి తొంగిచూడడానికి ప్రయత్నించింది. కానీ అతులుడు కనిపించలేదు. అవతలి వసారాలోనుంచి, కొందరి గొంతుకల్లో కలసి అతులుని గొంతుకూడా వినిపిస్తూవుంది. ఆ కొద్దిపాటిగుర్తే చాలనుకునేప్పటికి— మళ్ళీ ఒకసారి అతులుణ్ని చూద్దామనే కోరిక జ్ఞానదను యింకోఅడుగు ముందుకు తోసింది.

మానంగా జ్ఞానద ముందుకు సాగింది. ఒకస్తంభము చాటున నిలబడి, అతులుడు పిడికిలినిండా రంగుతీసుకొని పెద్ద త్తయ్య కాళ్ళమీదపోసి నవ్వుతున్నాడు.

వెళ్దాం-వెళ్దాం.. అనుకుంటూనే జ్ఞానద చాలాసేపు అక్కడే నిలుచుంది. యేమిజరుగుతుందని తను యింతవరకు భయపడుతూ వుందో-అదే జరిగిపోయింది. తనతల్లి తూలుకుంటూ యిటువేపే రావడం అకస్మాత్తుగా ఆమెచూసి-పరుగెత్తుక వెళ్ళితన రెండుచేతులతో నూతల్లినిపట్టుకొని "-ముందుకు యికనడవకమ్మా పద. యెక్కడికీ వెళ్ళనవసరములేదు... వెనక్కు తిరిగి పదమ్మా!" అని అన్నది.

రెండుకళ్ళూ యెర్రగాజేసి "యేం?" అని దుర్గమణి అడిగింది.

"యేమీ నేను చెప్పలేనమ్మా. కానీ, ముందునువ్విక్కడనుంచి తిరిగిపద. యికఆయనవల్లమన కేమీవుపకారంకాదు"

"అభాగ్యురాలా! నన్ను వొదులు!- ముందు నన్ను వొదులు ."అని అమానుష బలంతో దుర్గమణితననుతాను వదిలించుకొని ముందుకువెళ్ళింది. జ్ఞానదకూడా, ఆమెను అనుసరించి ఓమిషన్‌మీద నడిచే బొమ్మలా తల్లివెనుక వెళ్ళి నిలుచుంది. అందరూ అటు చూసారు. లోపల్నుంచి చిన్నకోడలు దేవరాణికూడా వచ్చింది.

సూర్యకిరణాలవలె ప్రకాశిస్తున్న దుర్గమణి రెండు కళ్ళనూచూసి, అతులుడు ముఖం క్రిందకు దించుకున్నాడు.

"అతులా!— మేము నీతో యేమని పోట్లాడామని మమ్మల్నిలా సర్వనాశనంచేసావు?" అనిదుర్గమణి అడిగింది.

అతులుడు యేమీ జవాబు చెప్పలేక, అపరాధపు బరువుతో తలెత్తలేక పోయాడు.

అతులుణ్ని వెనుకవేసుకొని స్వర్ణమంజరి జవాబు చెప్పింది. "యేం?... నిన్నేవిధంగా సర్వనాశనం చేసాడో యెందుకొంచెం చెప్పవమ్మా?"

"యీమాటకి నీకేమని జవాబుచెప్పనక్కాయ్? నే నెవరినయితే అడిగానో అతనికే తెలుసు?"

"మే మేమీ గడ్డితినడంలేదుచెల్లీ! అయితే యింతకూ నీకూతుర్ని పెళ్లిచేసుకుంటానని అతను యేమయినా నీతో ఖరారు చేసుకున్నాడా—యేం? వెళ్ళు—లోపలికివెళ్ళు! యివాళ పండుగ! పండుగనాడు అతన్ని కొంచెంసేపు సంతోషముగా వుండనియ్! నాయింట్లోకివచ్చి అనవసరంగా పోట్లాట కలిగించకు."

"పోట్లాడ్డానికిరాలేదక్కాయ్!"అనిఅతులునివేపుచూచి "యీ ఒక్కసంవత్సరమూ, మేమెలాగడిపామో నీకుతెలవదు కానీ, భగవంతునికి తెలుసు అతుల్! భగవంతుడే అందరికీ వున్నాడు...ఆయనగారి ఆఖరి గడియల్లో యెందుకలా మా హృదయాలకు ఆశనుకలిగించావు? నువ్విప్పుడేచెపితే బాగుం డేదికదూ?" అనిఅడిగింది.

స్వర్ణమంజరి తన హృదయం బాధపడినట్లుగా "నువ్వు నాపిల్లవాణ్ని అల్లరిపెట్టకుచెల్లీ! లేకుంటే బాగోదు తెలుసా?

మేము బ్రతికున్నంతవరకూ తనంతట తాను మాటయిచ్చేంత స్వతంత్రుడు కాడు తెలుసా?'' అని అన్నది.

దుర్గమణి యీ విధంగా అనడం,- యింతమందిముందు దెప్పి పదే పదే రెట్టించడం అతులునికిఅవమానంగాతోచింది. అత్తగారి అండచూసుకొని "నాఅంతట నేనే పెళ్ళి చేసుకుంటా ననిమాటయిచ్చానా యేం? పట్టుకున్న కాళ్లనువిడువకుండా కాళ్ల - మీద మాటిమాటికీ తలకొట్టుకుంటూ వుంటే- మీ నాన్న దగ్గర చెపుతానులే_ అని అన్నాను. మరి నేనేంచేయను? నా కాళ్లుపట్టుకుని విడువకుండావుంటే, అంతమంది ముందూ సిగ్గుకలిగి- వదిలించుకుందామని నేనలా అనాల్సి వచ్చింది. మరి నేనేం చేయాలి? అంత మాత్రంతో నేను మాటయిచ్చా నన్నమాట? బాగా నేవుంది.'' అని అన్నాడు.

స్వర్ణమంజరి కిలకిలా నవ్వుతూ "యేమిటేమిటి? యీ పిల్లే నీకాళ్ళుపట్టుకుని పెళ్లి చేసుకోమందా?-'' అని అడిగింది.

''నిజమో-కాదో,ఆమె నేఅడుగు... లేకపోతే యీపిల్లను పెళ్లి చేసుకుంటానని అంటానా? నడుముకి ఓ త్రాడుకట్టు కొని యెందులోనైనాపడి ప్రాణాలు పోగొట్టు కుంటానుగాని యీ పిల్లనుమాత్రం పెళ్లి చేసుకోను''

అతులుని వెంబడి వున్నవాళ్లంతా ముఖాలు త్రిప్పి నవ్వుతున్నారు. దుర్గమణి పిచ్చిదానిలా అరుస్తూ "అరిదుర్మా ర్గుడా- కృతజ్ఞుడా! యేమన్నావ్? నువ్వు చావాలనుకుంటే అలానే త్రాడుకొనిస్తానులే! నీబోటి కృతఘ్నులు చస్తేనే మంచిది. ...యింతమంది ముందు, యే పిల్లనైతే నువ్వు అవ

మానంచేసావో, ఆ పిల్లే ఒకప్పుడు వెట్టిచాకిరి చేసి, నిన్ను మృత్యుముఖం నుంచి తప్పించింది. ఆసంగతంతా మరిచిపోయిన కృతజ్ఞుడివి- నీకదంతా యెందుకు గుర్తుంటుందిలే-?" అని అన్నది.

చిన్నకోడలు దేవరాణి యిదంతా అయోమయంగా చూస్తూ, వింటూ నిలుచుంది. స్వర్ణమంజరి పోట్లాడడానికి తయారై "-అయితే యిదా నీపని- యిలాఅయితే ముందు నాయింట్లోంచి వెళ్ళిపో!-పిశాచి...హతభాగ్యురాలా-ముందు యిక్కణ్నుంచి పోవేం-పో-" అని అన్నది.

జ్ఞానద చేష్టలుదక్కి, రాతిబొమ్మలానిలుచుంది. ఆమెలో చైతన్యము లేదు. సిగ్గూ, తిరస్కారము, అభిమానమూ-అవమానమూ, యేమీ ఆమెలో లేవు. సమస్తాన్నీ మరిచిపోయి, చైతన్యములేని అయోమయపు దృష్టితో- మెదలకుండా చూస్తూవుండిపోయింది. చిన్నకోడలు దేవరాణి, జ్ఞానదను అటువంటి అవస్థలో యెప్పుడూ చూసుండలేదు. భయంగా ఆమె జ్ఞానదను ఒకత్రోపుత్రోసి- "జ్ఞానదా... జ్ఞానదా?" అని పిలిచింది.

కొంతసేపటికి "యేమిటిపిన్నీ-?" అని జ్ఞానదఅడిగింది.

" యింకా యిక్కడెందుకు నిలుచున్నారమ్మా?- మీ అమ్మను లోపలికి తీసుకెళ్లు-?"

"పదమ్మా- పద" అంటూ తల్లి చేయిపట్టుకుని జ్ఞానద మెల్లమెల్లగా తమ గదిలోకి తీసుకెళ్లింది.

"దేవరాణీ చూసావా- వీళ్ళకెంత దురాశపుట్టిందో? పౌర్ణమినాటి చంద్రుణ్ని పట్టుకునేందుకు చేతులు చాపడమంటే యిదే!" అని స్వర్ణమంజరి అన్నది.

అతులుడు నవ్వుదామని పండ్లికిలిస్తూ-"చూసావా, చిన్నత్తాయ్! యెటువంటి సిగ్గుమాలినపనో-?" అని అన్నాడు.

సగంవిరిగిన కంచుపళ్ళెంలా కనకనలాడుతూ స్వర్ణమంజరి అంది "యింత చిన్నవయసులోనే- యిదావని?- బాగానే వుంది. రామరామ ఘోరమైన కలియుగం!"

చిన్నకోడలు మెల్లగా నవ్వుతూ-" అవును, ఘోరమైన కలియుగమే! అందుకనే యింకా యిలావుంది గాని- యింకోయుగమైతే, భూదేవి యీ పాటికి సిగ్గుతో పగిలిపోయేదే అతులా-?" అని ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

వ్యంగ్యముతో కూడుకున్న ఆమె మాటలు స్వర్ణమంజరి తెలుసుకోలేక "నేనూ అనేది అదే-"అని ఆమె అన్నది. కానీ,- అతులుని ముఖం మారిపోయింది. చిన్నకోడలు అన్న ఆవ్యంగపుమాటల తాత్పర్యాన్ని స్వర్ణమంజరి తెలుసుకోలేకపోయినా- అతులుడు గ్రహించి బాధపడి, ముఖం మార్చుకుని వెళ్ళిపోదామని అనుకుంటూనే, రెండడుగులు అటూ యిటూ వేసి తిరగడం మొదలుపెట్టాడు.

వాస్తవికమైన సంగతి యిన్నిరోజులవరకూ కప్పబడే వుంది. చుట్టుప్రక్కల్లో వున్న వాళ్ళవల్ల- అనాధనాధుని పెద్ద కూతురు మాధురితో అతులుడి పెళ్ళి స్థిరపరిచారని దుర్గమణి విన్నది. ఆసంగతినే యిప్పుడు స్వర్ణమంజరి తిరిగిరెచ్చగొట్టింది.

పక్కనే నిలుచుని చూస్తూవున్న ఆ అమ్మాయిని చూసి, అతులుడు కూడా సంతోషించాడు.

# 7

చిన్నప్పటినుంచీ మాధురి, కలకత్తాలో మామగారింట పెరిగి-మహాకాళీ పాఠశాలలో యింగ్లీషు, బెంగాలీ-సంస్కృతము చదువుకుంటూ వుంది. పాటలు పాడడం, శివాజీ మందిరములో కూచొని, స్తోత్రపారాయణ చేయడం ఆమెకు తెలుసు! చూడడానికి ఆమె చాలా అందంగా వుంటుంది. యీమారు దుర్గాదేవి పూజలు చేయడానికిగాను, రెండుమాసాలుపాటు కలకత్తాను వదలి అమ్మగారింట వుండవలసి వచ్చింది. అప్పుడే ఆమె వివాహాన్ని స్థిరపరచుకున్నారు. అతులునిలాంటి వాణ్ని కష్టపడి వెదుక నవుసరం లేకపోయింది! ఆ పెండ్లికొడుకే వీళ్ళనద్దకు వచ్చాడు. యిక స్వర్ణమంజరి మధ్య వుందాయె—!

చిన్నకోడలు దేవరాణి అన్నగారు చాలాస్థితిమంతుడు ఆమె తల్లికూడా యింకా|బ్రతికేవుంది. దేవరాణి ప్రసవించే సమయం దగ్గరకు వచ్చినందున ఆమె వుండిపోయింది. మాధురి రావడంతోనే,-వెళ్ళి పెద్దమ్మకు నమస్కరించింది.

"చిరంజీవివికా-తల్లీ" అని మాధురుని దుర్గమణి దీవించింది. తరువాత అనిమేష దృష్టితో ఆమెను చూసింది. మాధురి అసలే అందమైనపిల్ల! దానికితోడు, మేనమామ

బాగా అలంకరించి పంపాడు! అత్త కూడా కలకత్తా నివాసస్థురాలైనందువలన, యే విధంగా పిల్లను అలంకరించాలో ఆమెకు తెలుసు! — వంటిమీద కొద్దిగనే నగలున్నాయ్!— చూస్తూ, చూస్తూ,–దుర్గమణి అప్రయత్నంగా "ఆహా!నిజంగా యీపిల్ల బంగారపు బొమ్మే!" అని అన్నది.

యిలా అంటూనే తనదృష్టిని, కాళ్ళవద్ద కూచుని అందచందాలులేని, మలిన వేషంతోవున్న తనకూతురు వేపు త్రిప్పింది. చూడగానే ఆమె కళ్ళు మండినయ్!–ఒక ప్రక్కకు వత్తిగిలి పడుకుంటూ– "నేనూ ఓ కూతుర్ని కన్నాను. యేం లాభం?– చుంచు మొఖం–దెయ్యపురంగు" అని అంది.

మాధురి గదిలో ప్రవేశించినప్పుడే, జ్ఞానద ఆ రూపరాసిని చూసింది. ఆ అపరిమిత సౌందర్యం... కన్నులు మిరుమిట్లు గొలిపే సిల్కు బట్టలనీ, తన మలిన వేషంతో పోల్చుకొని –సిగ్గుతో పాతుకుపోయింది. మాధురి జ్ఞానద దగ్గరకువచ్చి, "అక్కాయ్!– పద...కొంచెంసేపు ఆడుకుందాం." అని అన్నది.

యీ మాటకు జ్ఞానద యేంచెప్పిందో యెవరికీ తెలవదు కానీ,–మాధురి మాటలు దుర్గమణి చెవుల్లోబడడంతోనే, అటువేపుకితిరిగి పడుకున్నదల్లా యిటుతిరిగి–"నీమాడుముఖాన్ని బైటివాళ్ళకు చూపించకుండా, యిక్కడేవుంటే బావుంటుంది–వెళ్ళకు" అని అన్నది.

జ్ఞానద యేమీ మాట్లాడలేదు– యెలాకూచునివుందో అలానే కూచుంది.

మాధురి వెళ్ళాక, దుర్గమణి తన మనసులోని భయంకరమైనయీర్ష్యాజ్వాలలకు తట్టుకోలేకమూల్గింది. జ్ఞానద "తల నొప్పిగావుందా-అమ్మా! కొంచెంసేపు పట్టుకోనా-?" అని అడిగింది.

"వద్దు-"

"యేం?—కొంచెంసేపు తల పిసుకుతాను"

"వద్దు—వద్దు. నా మంచంమీదనుంచి అవతలకివెళ్ళు. సంకరపుముండా-నీముఖం చూస్తుంటే ఒళ్ళుమండుతూవుంది" అని కూతురును ఓతాపు తన్నింది.

జ్ఞానద యెన్నోవిషయాలు సహించింది. కానీ-యీనాడు తనను కన్నతల్లే,- యీవిధంగా తన్నడం సహించలేక-లేచివెళ్ళి భూమ్మీదపడుకొని "అయ్యో! భగవంతుడా-! అందరికళ్ళకూ నేనో పనికిరానిదానిగా మారిపోయానే! —నేనే అపరాధం చేసాను?- నాకు అందంలేదు-సరైనగుడ్డలూ నగలూ, లేవు. కన్నతండ్రీ లేడు. యిదంతా నాతప్పేనా?-రోగంతో కృశించిపోయిన శరీరము, మాడిపోయి- పాలిపోయిన యీ ముఖం- ఆఖరికి ఒక మగవాణ్ని ఆకర్షించలేకపోయింది... నేనేం జేయను? యిందులో నా తప్పేముంది?-దిక్కూ—మొక్కూ—లేని యీ అనాథ పిల్లపెళ్ళికోసం, ప్రయత్నించి చేయిఅందించే వాళ్ళుకూడా లేకపోయారు ..వయసు పెరుగుతూవుంది. యిదంతా నాతప్పేనా?- భగవంతుడా?... యిన్నితప్పులకి అర్హురాలనైననన్ను- యిక నాతండ్రిగారి దగ్గరకు పంపించు... యే ఆశ్రయమూలేని యీ కూతుర్ని

కన్నతండ్రి యెప్పుడూ తనహృదయానికి దూరంగావుంచడు"
-అని మనసులో అనుకుని యేడ్చింది.

"జ్ఞానదా-?" అంటూ దుర్గమణి కూతురు వేపు తిరిగింది. తల్లి పిలుపు విని, జ్ఞానద కళ్లను తుడుచుకుని లేచి నిలుచుంది

"నీరసంతో వున్న శరీరాన్ని- తడినేలమీద యెందు-కలా పొర్లిస్తావమ్మా-?" అని దుర్గమణి, తనంతట తాను లేచి కూచుంది.

జ్ఞానద మాట్లాడలేదు,

"ఓ...నిన్న తన్నానుకదమ్మా?" అంటూ- దుర్గమణి కన్నీళ్లు కారుస్తూ, కూతుర్ని గబుక్కన- లాక్కుని వక్షస్థలానికి హత్తుకుంది.

# 8

ఆనాడు సాయంకాలమయ్యాక, అనాథ్‌నాథ్ అకస్మాత్తుగా దుర్గమణి గదిలోకి వచ్చి ఖిన్నభావంతో- "నీవంట్లో యెలావుంది వదినా?- పడుకో...పడుకో, లేవకు మందూ మాకూ తాగడంలేదని విన్నాను· యిలా అయితే యెలాబాగవుతుంది వదినా?" అని అడిగాడు.

నిజంగా ఆమె మందుకూడా త్రాగడంలేదు. ఆమెకు మందు యిచ్చినా.- యివ్వకపోయినాఒకటే! బ్రతుకుదామనే ఆశ ఆమెకు లేనేలేదు యీ దీర్ఘరోగ ప్రవాహంలో యెక్కువకాలం బ్రతకలేనని ఆమెకు తెలుసు!-

కంఠస్వరము రానురాను క్షీణిస్తూవుంది. దగ్గరకువచ్చి మాట్లాడితేనే తప్ప వినిపించడంలేదు. మరిది యీవిధంగా, ఆకస్మికంగా, ఆత్మీయత చూపించడములో దుర్గమణి శంకించింది. కానీ,- ఆమె యేదో జవాబు చెప్పింది. విశేష ప్రయత్నంమీద విని అనాథ్‌నాథు- "అదినిజమే వదినా!- భర్తను పోగొట్టుకున్నాక బ్రతికుండి మాత్రం లాభ మేమిటి?-హిందూ మతంలో పుట్టిన ప్రతివాడూ యీవిషయంమీద చర్చించ లేదు. అయినా ఆత్మహత్య చేసుకోకుండా శేషించిన జీవితాన్ని, ఆయన్ని ధ్యానిస్తూ, కూతురిని ఒక యింటిదాన్ని జేసి-కాలాన్ని గడపడం ధర్మం. నీ స్థితిచూసి, ఆపిల్ల స్థితి చూసి, తప్పని సరిగా చెపుతున్నాను. జ్ఞానద పెళ్ళిప్రయత్నములో నేనేమీ అశ్రద్ధ చేయడం లేదని నీకూ తెలుసను కుంటాను. పిల్లనుగురించి యింకా యెక్కడా స్థిరమైన మాటలు మాట్లాడలేదు. పిల్ల పెళ్ళికోసం ఆరు, యేడు వూర్లు తిరిగాను కానీ,- యేమీ లాభం లేకపోయింది. పిల్లను చూస్తేనే, అందరూ భయపడుతున్నారు-" అని అన్నాడు.

దుర్గమణి మాట్లాడలేదు. క్షణంసేపు విశ్రామం తీసుకున్నాక అనాథ్‌నాథు మళ్ళీ "చిన్నన్నాయ్ పోయినప్పట్నుంచీ నువ్వు నా కుటుంబములోనే కలిసిపోయావు కదూ . ఆ కారణంవల్ల పోట్లాటలు కలుగుతున్నాయ్!- నీలకంఠముఖర్జీ నీకు తెలుసుగా— యింటింటికి తిరిగి యీ సంగతంతా చెప్పి వూరును కట్టుకట్టిస్తూన్నాడు. మీ తల్లీ కూతుళ్ళవల్ల నేను వూళ్ళో నిలువలేక పోతున్నాను. అయినా

యీ తల్లిని దూషించడమెందుకు?—పిల్ల యెంత పెద్దద యిందో మనకు స్వయంగా కనుబడుతూనేవుందిగా? పట్ట ణాల్లో యిటువంటి వాటికేమీ ఫర్వాలేదు. యెన్నితంటాలు యెన్ని యిబ్బందులూ-బాధలూవుంటాయో అవన్నీ మన పల్లె టూళ్ళల్లోనే తలెత్తుతుంటాయ్!'' అని ఓ నిట్టూర్పును విడిచాడు.

యేమి టేమిటో చెప్పుకు పోతున్న మరిదికి యేమని చెప్పాలో దుర్గమణి ఆలోచించింది కానీ,—ఆమె మనసు యింకోవేపు లాగడంవలన, అతనిముఖంలోకి వెర్రిగాచూసింది!

ఒకమారుదగ్గి అటూయిటూచూసి—"చిన్నవదనా! యెక్కడికీవెళ్ళే ఓపిక నీనంట్లో లేకపోవడం వలన నీకే సం గతీ చెప్పడంలేదు. కానీ,- యిప్పుడు నాకూతురుకుక్కూడా వివాహంచేసే, వయసు వస్తున్నందున అటుకూడా చూడాలి .. అందుకని మా అంతట మేమే యెటన్నా వెళ్ళిపోవాల్సి వస్తుంది. కాదూ, మనకు తెలిసిన చోటికి జ్ఞానదను పంపితే బాగుంటుంది· యీ యింట్లో యిక జ్ఞానద వుండకూడదు. ఆమెవల్ల మామీద పెద్ద ఆందోళన జరుగుతూవుంది.'' అని వున్న విషయం చెప్పాడు.

"అది యిప్పుడు యిక్కడికని వెళ్తుంది అనాథ బాబూ?"

"హరిపాళెం యెందుకని వెళ్లగూడదు?"

"అది అక్కడికి యెలా వెళ్తుంది?-అదీకాక అక్కడికి వెళ్తే దాని గతేంకాను?-

అనాధనాధుడు-"నువ్విలా అనడం న్యాయంకాదు వొదినా!—కేవలం నువ్వు నీస్వార్ధంకోసం యిలా చేయకుండా వూరుకుంటే మేమేంకాము? యెవరి కుటుంబములో నువ్వు కలసిమెలసి వుంటున్నావో-నీ బరువూ, మంచిచెడ్డలు, సుఖదుఃఖాలు, కరువుకాలంలో యెవరు మోసారో, వాళ్ళ మంచి చెడ్డల్నికూడా, నువ్వు గమనించడం నీధర్మంవొదినా!" అని అన్నాడు.

దుర్గమణి యీ మాటలకేమీ జవాబు చెప్పలేదు. ఆమె ఒక్క నిట్టూర్పు విడిచి వూరుకుంది. యీ నిట్టూర్పు అనాధనాధుని కోపాన్ని కొంత తగ్గించింది

"యిటువంటి సమయంలో, జ్ఞానదను హారిపాలెం పంపడం నీకు కష్టంగానే వుంటుందని నాకు తెలుసు. మరి యింకేముపాయముంది?- యింకో విధంగా అనుకోకు వొదినా! యిందులో నీతప్పుకూడా వుంది. నేను మీఅన్నగారికి వుత్తరం వ్రాసాను. ఆయన జ్ఞానద పెళ్లి నిమిత్తం అన్నీ సిద్ధమయాయనీ, కేవలం నువ్వు ఒప్పుకోకపోవడం మూలాన్నే అది తప్పిపోయిందనీ—ఆయన వ్రాసాడు. యింతకూ-చిన్న అభిప్రాయభేదంవల్ల నువ్వొచ్చేసావ్?-" అని వెళ్లిపోయాడు.

కొంతసేపటికి, యింట్లో పని పూర్తిచేసుకుని జ్ఞానద, తల్లిదగ్గరకు వచ్చింది. పిల్లను చూస్తూనే దుర్గమణి యేడుపు ఆపుకోలేక, సైగవల్ల కూతురును దగ్గరకుపిలిచి, జ్ఞానద వొడిలో తలుంచి-దుర్గమణి చిన్నపిల్లలా బావురుమని యేడ్చింది.

చాలాసేపు యేడ్చాక దుర్గమణి కళ్లంట నీళ్లురావడం ఆగినయ్!—

"నా మనసును తెలుసుకోలేవా-అమ్మా! నన్ను నీ దగ్గర్నుంచి వేరుచేయడానికి యెవరికి సాధ్యమవుతుంది?-యిది బాబాయిగారి యిల్లుకాదు. యీయిల్లు మానాన్నగారిది. బాబాయి మనకు అన్నంపెట్టకుండా చేస్తే చేయొచ్చుగానీ,- యిక్కణ్నుంచి వెళ్లిపొమ్మని చెప్పడానికి ఆయన కేమధికార ముంది?-బాబాయి అలా చెప్పినా, నా కేమీ సిగ్గులేదు· వక వేళ ఆయన అలాఅన్నా- నేనే నీకు తిండిపెట్టగలనులే— అమ్మా!" అని జ్ఞానద అన్నది.

కూతురు వొడిలో తలపెట్టుకుని, దుర్గమణి తనమానసిక కష్టాల్ని శాంతింపజేసుకుని, కొంచెంసేపట్లోనే నిదుర పోయింది. చాలా రాత్రివరకు జ్ఞానద మేలుకొని, "బాబాయి తిండిపెట్టకుండా వుంటే- అమ్మను నేనేవిధంగా బ్రతికించుకోవాలి" అని ఆలోచించింది.

జ్ఞానదను యింట్లోంచి వెళ్ళగొట్టేసంగతి చిన్నకోడలు దేవరాణి చెవుల్లో పడింది. అందువల్ల భర్తను వంటరిగా చూసి పిలిచి"—యిటువంటి ఆపదకాలంలో తల్లి దగ్గర్నుంచి ఆ పిల్లను విడదీయడానికి, పెద్దముసలివాడికిమల్లే మీబుద్ధి మీలో లేదాయేమిటి? జీవుల మెడమీద కత్తిపెట్టి కోసే కసాయివాడు. పిల్లనుంచి తల్లిని వేరుచేయడానికి భయపడి దయను చూపిస్తాడే! మీకా దయకూడా లేకపోయిందేం?—" అని అన్నది·

భార్య మాటల్ని విని అనాథనాథుడు వూరుకున్నాడు!

రెండోనాడు దుర్గమణి అనాథనాథుని తన రోగశయ్యా వద్దకు పిలిపించి, అతని రెండు చేతులూ పట్టుకుని- "అనాథ బాబూ! నువ్వు నాకు మరిదివి!- పైగా నేను నీకన్నా పెద్దదాన్ని! లేకపోతే నీ రెండు కాళ్ళూ పట్టుకొని నీ అన్నకూతుర్ని నీయిష్టంవచ్చినవాళ్ళకుదానంగాని,-యింకేమయినా చేయమని చెప్పేదాన్ని! యిటువంటిసమయంలో మాత్రం నాకూతుర్ని నా దగ్గర్నుంచి వేరుచేయకు"- అని జ్ఞానద రెండు చేతులు పట్టుకుని, అనాథనాథుని చేతుల్లో పెట్టింది.

అనాథనాథుడు తన రెండు చేతుల్ని గుబుక్కున వెనక్కిలాక్కొని "-యితరుల మాటలవల్ల నా సోదరత్వం చెడిపోయిందా? నాశక్తికొద్దీ నేను తంటాలు పడడంలో అశ్రద్ధేమీ చేయడంలేదు వదినా?-వాళ్ల మాటలు విని వూరుకునేంత మూర్ఖుణ్ని మాత్రంకాదు... కానీ, శ్మశానములోవుండే శవానికూడా యీడుగాపి పిల్లను, చేసుకోవడం అయిష్టతగా వుంది సరే-నీదగ్గరవుండే ఆకమ్మలు యేంచేసావు?-" అని అడిగాడు.

"అవి మీఅన్నగారి శ్రాద్ధకర్మలకు అమ్మేసాను అనాథబాబూ!"

నిరాశాభావాన్ని వ్యక్తపరుస్తూ- "అయితే నేనేంచేయను?-ఒక్క దమ్మిడికూడా యివ్వలేవు-పిల్లను వదలిపెట్టలేవు. యింతకూ రెండుకాళ్లూ నాచెత్తినపెట్టి యెక్కి, సవారి

చేద్దామనుకున్నట్లుంది—అంతేనా?" అని అడిగి అనాథ నాథుడు కోపంతో వెళ్లిపోయాడు.

అతను వెళ్లాక దుర్గమణి క్షణంసేపు స్థిరంగా కూచుని, గబుక్కున కూతురు చేయిపట్టుకుని వూపుతూ— "నువ్వు నా కూతురివికదూ?—. . చీకటి పడబోతూవుంది, యింట్లో యికనైనా దీపం వెలిగించవా-యేం?" అని అడిగింది.

అన్యమనస్కతోనున్న జ్ఞానద, యేదో చెప్పబోతూ వుండగనే-దుర్గమణి కోపంతో- "దీన్ని మృత్యువుకూడా దగ్గరకు తీసుకోవడానికి భయపడుతూవుంది. యిటువంటి చండాలపు ముండక్కూడా అభిమానమనేదొకటి అండపెట్టుకుని రాజుగారి కూతురిలా కూచుంది. యేం జ్ఞానదా?-లోకమంతా యిలా నీచంగా చూస్తున్నా నీప్రాణం పోదేమే?-మూడు రోజుల జ్వరానికే ఆవాళ పాపం, ఘోష్ కొడుకు అన్యాయంగా చచ్చిపోయాడు. సంవత్సరాన్నుంచి జ్వరంతో, శతమతమౌతూవున్నా, నిన్నాయముడు తీసుకెళ్లడేమే? సిగ్గూ, శరమూ లేకుండా నీముఖాన్ని యింకా యీ ప్రపంచానికి చూపిస్తూ బ్రతుకుతున్నావేమే?-యింకొకత్తైతే యీపాటికి యెక్కడ్నన్నాపడి చచ్చేదే!-పో. . .పో. . నా దగ్గర్నుంచి అవతలకు వెళ్లు! ఒక్క గడియైనా శాంతంగా వూపిరి పీల్చుకుంటాను. వూపిరాడనీయకుండా రాత్రింపగళ్లు జలగలా నారక్తాన్ని పీలుస్తూ తిరుగుతున్నావ్.—పో నాముందు నుంచి." అని జ్ఞానదను ఒక్కతోపు తోసింది.

యింకోపిల్ల అయినట్లయితే యీపాటికి, అవమానం వల్ల ఆత్మహత్య చేసుకునేదే!- కానీ, యీపిల్ల భూదేవిలా అన్నీ సహించి మాట్లాడకుండా లోపలకు వెళ్ళి యింటిపనుల్లో నిమగ్నురాలైంది. యీవిధంగా తనను తిట్టేప్పుడుకూడా, నోరు తెరిచి- "అమ్మా యెలాచావాలో, నాకూ తెలుసు. అయినా అన్నీ సహిస్తూ, నీమనసుకు యింకా కష్టం కలుగు తుందని, బ్రతికున్నాను"- అని చెప్పలేకపోయింది.

జ్ఞానద దీపం వెలిగించి- యింట్లో నీళ్ళుచల్లి- నిప్పురాజేసి, ఒకదీపపు ప్రమిదలో వత్తి వెలిగించి, తులసికోటమీద పెట్టడానికి వెళ్ళింది. ఆ పిల్లకు చిన్నతనంనుంచీ తులసికి పూజ చేయడం అలవాటు! తులసికోట దగ్గరకు వచ్చేప్పటికి- ఆమె తననుతాను సమ్మాళించుకోలేక పోయింది. మెడకు పైట చెంగు చుట్టుకుని, నమస్కరించేందుకు కూర్చుని లేవలేక పోయింది, రెండుచేతులూచాపి, సాష్టాంగ దండంపెట్టి— "ఓ నారాయణా!- భగవంతుడా!-యీస్థళంలోనే, యిక్కడే నువ్వు నాండ్రిని తీసుకొని వెళ్ళావు. యికనాతల్లినీ, నన్నూ తీసుకొనివెళ్ళి మానాన్న దగ్గరకుచేర్చు. మేమిం. కష్టాల్ని- దుఃఖాల్ని బాధల్ని-భరించలేము-" అని వాపోయింది.

## 9

చైత్రమాసపు కృష్ణపక్షంకూడా మంచిదికాదంటారు. యీ పదిహేనురోజులూ, యెవరూ యేవిధమైన శుభకా

ర్యాన్నీ చేయరు. అందువల్ల చిన్నకోడలు దేవతాణి, తన తండ్రిగారింటికివెళ్లే ప్రయత్నంకూడా ఆగిపోయింది. శుక్లపక్షం ప్రారంభం కావడంతోనే- ఆమె చిన్నన్న. ఆమెనీ— మాధురినీ తీసుకొని వెళ్ళడానికి వచ్చాడు.

ఆరోజు ప్రయాణానికి ముహూర్తం బాగావుంది!— భోజనమూ అదీ అయాక వెళ్ళేందుకు యేర్పాటు చేసుకున్నారు. అతులుడు యెందుకనో అక్కడికి వచ్చాడు. స్వర్ణమంజరి అతన్నికూడా భోజనానికి రమ్మనమని పిలిచింది.

మధ్యాహ్నం మాధురి మేనమామా, అతులుడూ, భోజనానికి కూచున్నారు. స్వర్ణమంజరి వాళ్ళ దగ్గరగా కూచుని. మాధురిని వడ్డనకు పెట్టింది. ప్రొద్దున్నే జ్ఞానదతో రహస్యంగా వంటచేయించి- వడ్డనకురావద్దని చెప్పింది. అసలే జ్ఞానద సిగ్గుతో యెవరికంటికీ కనిపించడమూ లేదు. వీలయినంత వరకు, ఆమె తనను యెవరూ చూడకుండా వుండేట్లు పక్కపక్కకు తప్పుకుని సంచరిస్తూవుంది.

అతులుని పెళ్లి మాధురితో అవుతుందనీ,-మాధురిని కలకత్తాకు తీసుకవెల్తున్నారనీ, గొప్పగా మాధురిని అలంకరించారు. వడ్డించేప్పుడు సిగ్గుతో ఆపిల్ల యేదైనా పొరపాటు చేస్తే, స్వర్ణమంజరి-" చేతకానిదానా-అభాగ్యురాలా!-అవతలకు పో!" అని ప్రేమపూర్వకంగా అంటూ, ఒక్కొక్కప్పుడు నవ్వుతూ-ఆమె పొరపాటును విడమరచి చెపుతూ వుండేది! ఆసమయంలోనే-ప్రపంచంలోని అన్ని ప్రాణుల కాళ్ళతోనూ తొన్నబడిన యింకొపిల్ల, వంటింటిమూలలో తల

వొంచుకుని కూర్చుని-మాధురికి వడ్డించే పదార్థాలు, వొక్కొ క్కటి అందిస్తూవుంది.

స్వర్ణమంజరి యెంత గబగబా మాధురి పెళ్లి విషయం వాళ్లతో చెపుతూవుందో- అంత యిదిగా మాధురి వంటింట్లోకి వచ్చింది. రావడంతోనే-"యేంకావాలి?" అని జ్ఞానద అడిగింది.

"యింకేమీ వద్దక్కాయ్! యిక నాచేతకాదు." అని ఖాళీగావున్న తన చేతిలోని అన్నపు పళ్లాన్ని సిగ్గుతో క్రిందపెట్టి వెళ్లిపోయింది.

క్షణం సేపయాక స్వర్ణమంజరి-"కొంచెం వుప్పుపెట్టి వెళ్లమ్మాయ్?" అని కేక వేసింది.

అలా పెద్దమ్మ కేకపెట్టి పిలిచినా, వుప్పుయిచ్చి రావడానికి మాధురి వెళ్లలేదు. మళ్లీ స్వర్ణమంజరి గట్టిగా- "మాధురీ-యేంచేస్తున్నావే? వుప్పు లేక మీ చిన్నమామ అన్నం తినకుండా కూచుని వున్నాడు" అని కేకపెట్టింది.

యీమాటకు కూడా మాధురి వెళ్లలేదు. కానీ,- జ్ఞానద వుండలేక పోయింది. ముట్టుకున్నంత మాత్రంలో వుప్పు చెడిపోయే పదార్థంకాదనీ,-ఆపిలుపు తనకుగూడా వర్తిస్తుందనీ, అనుకుని-తన చినుగుల ధోవతిని వంటినిండా కప్పుకుని, వుప్పువున్న పాత్రను తీసుకుని వాకిలీవద్దకు వచ్చి, నిలుచుంది. భోజనం చేస్తున్న అయిద్దరు యువకులూ ఆమెను చూడలేదు, స్వర్ణమంజరి మాత్రం, తల మొదలు పాదాల వరకూ, రెండు పర్యాయాలు యీర్ష్యగా చూసి, కోపంతో

మెల్లగా "నిన్ను తెమ్మని యెవరు చెప్పారే? మాధురి యెక్కడికి వెళ్లింది-?" అని అడిగింది.

"యేమో, యెక్కడికో వెళ్లింది పెద్దమ్మా!"

"అందుకనే, పాపం-వచ్చావన్నమాట? నీకు యెన్ని సార్లని చెప్పను?-సిగ్గులేదూ-నీముఖాన్ని చూ స్తే, యేడు తరాలవాళ్లుకూడా నరకానికి వెళ్తారని నీకు వందసార్లు చెప్పాను గదా!-సిగ్గులేదూ?-అతులుడు యిక్కడకు భోజనానికి వచ్చాడని, ఆయన ముందుకు వచ్చావన్నమాట-? జాగ్రత్త వుప్పు గిన్నె అక్కడే పెట్టివెళ్ళు-" అని అన్నది.

పెద్దమ్మ ఆజ్ఞానుసారంగా, జ్ఞానద వుప్పు గిన్నెను అక్కడే పెట్టి వెళ్లిపోయింది.

స్వర్ణమంజరి తనే స్వయంగా వుప్పు వడ్డించి-మామూలు స్థానంలో కూచుని అతులునితో-"నీకేం, మగవాడివి. అలా సిగ్గుపడుతావేం నాయనా! తినవేం?-తిను. తల వంచుకుని అలా కూచున్నావేం?-తిను" అని అన్నది.

మాధురి మేనమామ..."ఆయమ్మాయ్, యెవరకాయ్?" అని అడిగాడు,

"యెవరూ లేరులే మీరు భోజనం చేయండి"- యీహాస్యపు మాటలతో స్వర్ణమంజరి అతులుని సంతోషపరుద్దామనుకుంది కానీ,- అతులునికి భోజనం సహించలేదు- భోజనమంతా అతులునికి నీరసంగా కనుపించింది, మాధురునిచూచి జ్ఞానదను మరిచిపోయినమాట యదార్థమే! కానీ,- జ్ఞానద అతని మనసులోనే యిమిడి దాక్కొని పోయింది. జ్ఞానద తన

ను ప్రేమించేదీ, అసహ్యించుకునేదీ, యిప్పుడు అతనికి తెలవక పోయినా— ఒకప్పుడు, ఆమె తన ప్రాణాలకంటే అత్యధికంగా ప్రేమించి సేవచేసిన సంగతి అతనింకా మర్చిపోలేదు. ఆ రోజుల్లోకూడా జ్ఞానద స్వేచ్ఛగా అతని ముందుకు వచ్చేరుగదు. యివాళకూడా ఆమె పక్క పక్కల్నే నిలుచుంటున్నపుడు, అంతపెద్ద అపవాదును ఆమెమీద వేసినపుడు, – అతులుడెలా నమ్మగలడు?–

మూడోజామున చిన్నకోడలు దేవరాణి- కూతురు మాధురిని తీసుకొని పుట్టింటికి వెళ్ళిపోయింది. వెళ్ళేప్పుడు, రెండో అక్కాయ్ దుర్గమణిని కలుసుకోలేక ఆదరబాదరగా వంటింటిలోకివెళ్ళి –జ్ఞానద పిడికిలిలో, పదిరూపాయల నోటును పెట్టి- దొంగలా బైటకు వచ్చేసింది. జ్ఞానద పెట్టిన నమస్కారముకూడా ఆమెచూడలేదు.

ఆయింట్లో, నిర్భాగ్యురాలైన యీ పిల్లనుచూసే వ్యక్తికూడా యీనాడు వెళ్ళిపోయింది. యింట్లోవున్నప్పుడు పినతల్లి జ్ఞానదకు యే సహాయం చేసేదో, చేయదో- అది అడగవలసిన విషయంకాదు. ఆమె చేసిందల్లా, జ్ఞానద విచారంగా వున్నప్పుడు జ్ఞానదతోపాటు ఆమెకూడా విచారం చూపేది. ప్రేమతో ఓదార్చేది! అవిచారాన్ని తొలగించే వుపాయం ఆమెకు అనవసరం. తనమీద పినతల్లిచూపే సానుభూతే జ్ఞానదకుచాలు. ప్రేమను కనుబరిచే పినతల్లి వెళ్ళిపోవడంతోనే, ఆమెహృదయంలో- అత్యధికమైన గాఢాంధకారం క్రమ్ముకుంది.

సగం వైశాఖమాసం గడిచిపోయింది. అనాథనాథుడు ఒకనాడు ఆఫీసుకు వెళ్ళడానికి తయారవుతున్నప్పుడు- పెద్ద వొదిన దీనవదనంతో అతనిముందుకు వచ్చి నిలబడింది.

భయంగా అనాథనాథుడు- "యేమయింది వొదినా? యేమయిందేం?" అని అడిగాడు.

"నువ్వేంచేస్తావుఅనాథబాబూ?- రెండో చెల్లిదుర్గమణిపో..."

మాట పూర్తిగాకమునుపే చేతిలోవున్న హుక్కాదానంతట అదే క్రిందకు జారిపోయింది.- "యేమిటివొదినా?- నాకు తెలవదే?" అని గబగబా అడిగాడు.—

"యేమిటబ్బాయ్-? అలాయిదవుతావేం, ఆమె యిప్పుడే చావదులే! కానీ, ఆమెయిక యెక్కువకాలం బ్రతుకదు. మహాఅయితే, పది పదిహేను రోజులు బ్రతుకుతుందేమో ? ఆమె పోయింతర్వాత సంవత్సరంవరకుగాని, లేకపోతే ఆరుమాసాల పాటుగాని, పిల్లకు పెళ్ళి చేయుకుండను. మాధురికి పెళ్ళి యీ ఆషాఢమాసంలో చేయదలచుకున్నాను. యీ విషయంలో నేనెవరిమాటా యిక వినదలచుకోలేదు. పైగా అటువంటి మంచి సంబంధమిక మనకు దొరుకదు! యిచ్చి పుచ్చుకోవడాలలోకూడా పోట్లాటలూ, పేచీలు వుండవు యీపిల్లనే- పిల్లవాడు కోరుతున్నాడుకూడా!- యిటువంటి మంచి సంబంధాన్ని నాచేతుల్లోంచి జారవిడుస్తానా?"

"కాదు- కాదు. అలా యెప్పుడూ కాదువొదినా! దేవుడనుకోనీయ్,దయ్యమనుకోనీయి-నువ్వేమా యింటికిఅధిపతివి. మాధురే నీకూతురు, అతులుడికిచ్చి చెయ్యదలచుకుంటే, నీ

యిష్టానుసారంగాచేయ్!- యీ విషయంలో మాత్రం నేను జోక్యం కలుగ చేసుకోనువాడినా-'' అని అన్నాడు.

స్వర్ణమంజరి గర్వంగా-''నువ్వు చెబితేనేనా—నేను తెలుసుకునేది. నామాటకు విరుద్ధంగా మాట్లాడ్డానికి నీకే మవసరముంది? అలాంటి యిలాంటి మనిషివికావని నాకు తెలుసు! అందుకనే నేను చెప్పిందంతా చేయాలి. అనుమానం గినుమానం పెట్టుకోకుండా, యెవరుదొరికినా సరే, తీసుకొచ్చి జ్ఞానదకు ముడిపెట్టు. దానితో నీబరువు తగ్గుతుంది. అలాచేయకపోతే, మాధురికే పెళ్లికాదు. యీచుట్టుప్రక్కల వాళ్ళు నానాతిట్లు తిట్తారు.'' అని చెప్పింది.

స్వర్ణమంజరి చెప్పిన వుపదేశాన్ని ఆలోచిస్తూ, ఆలోచిస్తూ-అనాథనాథుడు ఆఫీసుకు వెళ్ళాడు. ఆనాడు మధ్యాహ్నం స్వర్ణమంజరి అకస్మాత్తుగా దుర్గమణి గదిలోకి వచ్చింది. వస్తూనే స్వర్ణమంజరి ''నీవంట్లో యెలావుంది-చెల్లీ?'' అని అడిగింది.

యెంతో కష్టంమీద అటున్న దుర్గమణి యిటుపొర్లి, చేయి వూపుతూ-''యిప్పుడింకా ఆరోగ్యమేమిటక్కాయ్?-యెక్కువకాలం యీకష్టాలు లేకుండా వుండేట్లు ఆశీర్వదించు అక్కాయ్!'' అని అన్నది.

''లేదు ... లేదు ... అలా భయపడడాని కేముంది?-తొందరగానే నయమవుతుందిలే!-''

దుర్గమణి జవాబు చెప్పలేదు.

స్వర్ణమంజరి అసలు సంగతి బైటపెడుతూ "—పిల్ల చాలా పెద్దదైంది చెలీ! వయసును చూస్తూ, విచారిస్తూ కూచుంటే బావుండదు. జ్ఞానద పెళ్ళికోసం ఒక మనిషితో మాటలు జరుగుతున్నై. తల్లీదండ్రీ లేరు. ఆయనే స్వయంగా పిల్లను చూడ్డానికి వస్తాడని యిప్పుడే కబురు వొచ్చింది. పిల్లను ముస్తాబు చేయాలి" అని అన్నది.

దుర్గమణి యేమీ మాట్లాడలేదు.

క్షణం గడిచింతర్వాత స్వర్ణమంజరి మళ్ళీ, "ఆ దుర్గాదేవి దయవల్ల, పిల్ల అతనికి నచ్చిందా అంటే,-మరిదిగారి కష్టం ఫలించిందనుకోవచ్చు!-ఆ తరువాత యిచ్చిపుచ్చుకోవడాలు, అతని విషయంలో నేను చెప్ప..."అని చెప్పబోతూండగా, దుర్గమణి లేచి కూచుని, జాలికలిగే చూపులతో చూస్తూ,-యీసంభంధమైనా స్థిరపడేట్లు ఆశీర్వదించు అక్కాయ్!-యిద్దైనా నాకళ్ళతో ....." అని అంటుంటే-ఆమె కళ్లంట నీళ్లుకారాయ్.

"నే నెప్పుడూ ఆశీర్వదిస్తూనే వున్నాను చెల్లీ! రాత్రిం పగళ్ళు భగవంతుణ్ని యీపిల్లకు పెళ్ళయేట్లు యేర్పాటు చేయితండ్రీ అని వేడుకుంటూనే వున్నాను. దుఃఖితుల ఆక్రందన భగవంతుడెందుకని వినడు? అల్లుని ముఖం చూసాక... .."

దుర్గమణి నీరసం[illegible]గుతో కన్నీళ్ళుతుడుచుకుంది. స్వర్ణమంజరి యిటు అటూ చూసి-"అనాధ[illegible]ధుడి సంగతి యేమని చెప్పను చెల్లీ? నెలకు నూటయ్యాభైరూపాయలు

సంపాయిస్తాడని అందరూ అంటారుకానీ.-అతనికున్న పిల్లా, జెల్లా, సంసారం, యిదంతా యెంత ఖర్చుతో గడుస్తుందో యెవరికేం తెలుస్తుంది? పైగా యిప్పుడు తన కూతురి పెళ్ళి విషయం యెలా చేయాలా?-అని తెగ ఆలోచిస్తూ కూచుం టున్నాడు. దానికితోడు నీకూతురి పెళ్ళొకటి-యీరెండు విషయాలతో- అతని మనసు శతమతమవుతుంది అందుకని అనాథనాథుడు నీకు చెప్పడానికి సిగ్గుపడుతున్నాడు. నీభాగం యిల్లు యెక్కడైనా తాకట్టుపెట్టి, పెళ్ళి చేయొచ్చని నాతో చెప్పాడు. నువ్వేమీ చేయనవసరం లేదు. పూరికే ష్టాంపు మీద సంతకం చేస్తే చాలు...తక్కినవన్నీ ఆయనే నడుపు తాడు. వ్రాతకోతలు యేమీ వుండకపోతే యెవరూ డబ్బి వ్వరమ్మా-? యిది కలికాలం. నువ్వు చచ్చినా బ్రతికినా, యెవరూ చూడరు ..అయినా ప్రపంచం... .."

ఆమాట పూర్తికాకముందే దుర్గమ్మ "నేనింకెంత కాలముంటానక్కాయ్!-మీకందరికీ యెలా చేయాలని వుం టుందో-అలానే కానీయండి. నేను నీమాటకేమీ అడ్డు చెప్పను. కానీ, నాకూతురు అంతులేని సముద్రంలో రెక్కలు లేని పక్షిలా పడిపోయేట్లు మాత్రం చూడకండి-" అని అంది.

"కాదు-కాదు. అలా యెందుకు చేస్తాం! తండ్రీ-పిన తండ్రి. తల్లీ,- పెత్తల్లీ.వీళ్ళలో యేమయినా భేదముందా' మేమలా చేయదలచుకుంటే, [illegible]బగళ్ళు నిద్రాహారాలు మాని యెందుకిలా ఆలోచిస్తూ కూచుంటాను ?-మాదృష్టిలో జ్ఞానదా, మాధురీ యిద్దరూ ఒకటే! యేం అమ్మాయి జ్ఞానూ?-

మీఅమ్మకళ్ళు తుడువు కూచుని కొంచెం విసనకర్రతో విసురు.'' అని చెప్పి స్వర్ణమంజరి దుర్గమణికి ఆశను కల్పించి-అక్కడనుంచి వెళ్ళిపోయింది.

యిప్పటికి చాలాకాలంనుంచి మృత్యుముఖంలోనున్న దుర్గమణి ముఖంమీద ఆనందదీప్తి మెరిసింది! పిల్లచేతిలోని విసనకర్రను లాక్కొని, రక్తహీనమైన తన దుర్బలహస్తాన్ని, తలమీద తట్టుతూ-"యిక్కడే కొంచెంసేపు పడుకోమ్మా!" అని పిల్లను లాక్కొని -" యీ అభాగ్యురాలి కడుపున పుట్టడంవల్ల, యెన్నో కష్టనిష్టూరాల్ని భరించావు. మగవాడివిగా యెందుకు పుట్టలేకపోయావమ్మా!-యీకష్టాలు వుండేవి కావుగా?''అని అంది.

జ్ఞానదను యిలా ప్రేమించడం-ఓర్పుతో మెల్లగా యిలా మాట్లాడడం దుర్గమణికి చాలాకాలమయింది. నోటి నుండి మాటలు రాకపోయెనా, కళ్ళంట నీళ్ళు కారుతున్నాయ్!

కొంచెం సేపయాక తల్లీ కూతుగూ నిద్రపోయారు. అకస్మాత్తుగా తల్లి లేపడం వలన జ్ఞానద లేచి కూచుంది. "లే-తొందరగా కానీయ్! ప్రొద్దెక్కడిది? నాతగరపు పెట్టెలో కొద్దిగ సబ్బుండవచ్చు. వెళ్ళు-దాన్ని తీసుకుని చెరువులో ముఖమూ, కాళ్ళూకడుక్కురా!-యింతకూ యెవరిమాటా నువ్వు వినవ్-అదే నీదగ్గ... పెద్దదోషం. వెళ్ళు...'' అని దుర్గమణి అన్నది.

తల్లి చెప్పిన విధంగా పెట్టె తెరిచి, చాలాకాలంనుంచి అందులో వుంటున్న ఓచిన్న సబ్బుముక్కను తీసుకుని-తుండు గుడ్డ భుజానవేసుకుని బయలు దేరింది.

"బాగా రుద్దుకొని, స్నానంచేసి రావమ్మా! వూరికే స్నానం చేసానంటే, చేసానన్నట్లుగా చేయకు. తొందరగా తెముల్చుకునిరా!-వాళ్ళు యెప్పుడొస్తారో తెలవదు-" అని తల్లి అన్నది.

స్నానంచేసి వచ్చి, జ్ఞానద స్తబ్దురాలై నిలుచుంది. అశక్తురాలై, యెన్నోరోజులనుంచి మరణశయ్యమీద పడి వున్న దుర్గమణి, లేనిఓపిక తెచ్చుకొని, లేచివెళ్ళి-ట్రంకు తెరిచి అక్కడే కూచుని అందులోంచి ఓరంగుచీరా, ఓజా కెట్టూ, జ్ఞానద కోసంతీసి, పిల్లనుచూస్తూనే "మరిచిపోయా నమ్మా! నీతల దువ్వడం మరిచేపోయాను. నువ్వు స్నానం కూడా చేసొచ్చావు. ఫరవాలేదులే?- కూచో!_చిటికిలో తల దువ్వుతాను.? "అని అన్నది.

"వద్దమ్మా- వద్దు నువ్వాపని చేయలేవు. నీ కాళ్ళు పట్టుకుంటాను. కొంచెంసేపు నువ్వుపడుకో! నాతలని నేను దువ్వుకుంటాను. నామీదవట్టు."

"హు' నాచేతకాదూ? నీకు తెలవదు జ్ఞానదా?-తలలు దువ్వించుకునేందుకు, యెంతమందినాచుట్టూ చేరేవాళ్లో నువ్వప్పుడే మర్చిపోయావా? ఆలస్యంచేయ్యకు-" అంటూ దుర్గమణి బలవంతంగా కూతుర్ని తన కూచోబెట్టుకొని, చాలా అందంగా దువ్వింది. పిల్లకాళ్ళకు పారాయణ, నొసటకుంకుమ

బొట్టూ- పెదిమలకు రంగు వేయడం, యేవీ ఆమె మరిచిపో లేదు! పిల్లముఖాన్ని ఒకసారి అటూయిటూ త్రిప్పి, ఒక్క ముద్దు పెట్టుకొని, మనసులో -"నాకూతురు అందగత్తె కాదని యెవరంటారు? శరీరం కొంచెం నల్లగావుంది! యింతమాత్రానికే పిల్ల పనికిరానిదా? యీకళ్లూ, యీముఖం- యెవరికుంటాయ్! ...యిదే నా చేతులతో అలంకరించే ఆఖరి అలంకారంగా మోలు!" అని అనుకుంది.

చీకటి పడడానికింకా ఆలస్యముంది. అయినా దుర్గమణి పడుకుందామని అను  లేదు. సమస్తమైన విచారాలూ మరిచిపోయి, పిల్లదగ్గరే కూచుంది. పెండ్లివాళ్లు జ్ఞానదను చూసేందుకు వస్తారనివిని, పొరుగింటి నీలకంఠ ముఖర్జీ భార్య తరంగిణీ- యింకా యిద్దరు ముగ్గురు ఆడవాళ్ళు వొచ్చారు. యథాసమయానికి పెళ్లికొడుకువాళ్ళువచ్చి, పిల్లను పిలిచారు. చూడడానికి వచ్చిన ఆడంగులు, కూచున్న చోట్లలోంచే తొంగితొంగి చూడడం సాగించారు.

దుర్గమణి వొంటరిగా మరణశయ్యమీద కూచునివుంది ఒక్కొక్క క్షణం-ఒక్కొక్కయుగంలా ఆమెకు చాలాకఠినంగా దొర్లుతున్నాయ్!- యేమవుతుందోనని ఆమె పెద్ద ఆందోళన పడుతూవుంది.

పెండ్లికొడుకూ, మధ్యవర్తి మహాశయుడూ-ఫలహారం చేసి వెళ్ళారని దుర్గమణి [illegible]ంది. అతని అద్దెబండి 'టక టక' లాడుతూ, వెళ్ళిపోవడ[illegible]ింది. తరువాత తరంగిణి

గదిలోకివచ్చి, సిట్టూర్పు విడిచి- "పిల్లవాళ్ళకు నచ్చలేదు" అని అంది.

కళ్ళుమూసుకుని పడుకున్న దుర్గమణి- సంగతులేమీ అడిగి తెలుసుకోలేదు.

"యెముకలు బైటికితొంగిచూస్తున్నపిల్ల- యెవరికైనా నచ్చుతుందా? యికనైనా జ్ఞానదకు నువ్వు కొంచెం మంచి తిండీ, బట్టాయిచ్చి, చక్కగా పెంచు మేము చిన్నప్పటినుంచీ చూస్తూన్నాం, అప్పుడు యిలావుండేదా? ఒక్క సంవత్సరం పాటు ధైర్యంగా--మంచి మంచి వస్తువులు తినిపించిచూడు, యెలా తయారవుతుందో! ?- అంతా యెగిరి గంతేసి పిల్లను కళ్ళకద్దుకుంటారు- తెలుసా?-" అని తరంగిణి మళ్ళీ అంది.

ఆమె చెప్పిందేమో- నిజమే! అయినా డబ్బెలా వస్తుంది?- పైగా తిండిపెడుతూ కూచోపెట్టడానికి కాలమేది? లోకులు వూరుకుంటారా?- పదిహేనోయేడు నడుస్తూవుంది. లోకులు కాకుల్లా, నరకానికి యీడవరూ?-

యిప్పటికే ఆవూళ్ళో వాళ్ళంతా, కళ్లు ఎఱ్ఱగాచేసి-బహిష్కరిస్తామని దబాయిస్తున్నారు. యిక పిల్లకుపెళ్ళిచేయకుండా కాలయాపన చేయడం బావుండదని దుర్గమణి అనుకుంది. పైగా ప్రతివారూ "-యీపిల్లను తొందరగా యెవరి మెడ కన్నాకట్టి- పంపించేయ్! యేవిధంగానైనా సరే,-యెవరుదొరికినా సరే,- వాడితో జ్ఞానద పెళ్ళిచేసి, జాతినీ-ధర్మాన్నీ కాపాడి యింత పెద్దపిల్లను యింట్లో [illegible] దుకు దుఃఖమనుభవిస్తూ స్వర్గంలోవున్న తండ్రినీ. [illegible]తలనీ రక్షించు... ఆఖరికి రేపో

మాపో చచ్చిపోయే వాడికైనా సరే, యిచ్చి-అంటగట్టు—"
అని సలహాను యిస్తున్నారు.

అప్పటికింకా దుర్గమణి గదిలో దీపం వెలిగించలేదు. తనని- ఒకరు ఆకర్షింప చేయలేని శృంగారాన్నీ, చీరనూ-జాకెట్టునూ తీసివేయడానికి ఆచీకటిగదిలోకి జ్ఞానద ప్రవేశించింది. యిటు దుర్గమణి మంచానికి శవములా ఆనుకొని పడుకుంది.

కొంచెం సేపయాక జ్ఞానద-తల్లికాళ్ళదగ్గరకు వెళ్లి కూచుంది. పిల్లదగ్గరకు వచ్చినసంగతి తెలుసో, తెలియకో- క్షోభవల్ల, దుఃఖంవల్ల ఆమె మాట్లాడలేదు. చాలాసేపు నీరసంగా కూచుని, జ్ఞానద, తన మనోవ్యథతో కృంగిపోయిన శరీరంతోపాటు, ఆకలితో అక్కడే పడుకుని నిదురపోయింది.

## 10

దుర్గమణి స్థితిచాలా ప్రమాదంగా వుంది. యెప్పుడు యేం జరుగుతుందో, చెప్పలేనంత పరిస్థితి యేర్పడింది. దాని మీద ముసలి మగవాళ్ళవల్ల సమస్త శాస్త్రాలు నేర్చుకున్న ముసలి ఆడవాళ్ళు దుర్గమణికి- "యి తపెద్దదయిన నీకూతురు మీ పితృలోకాన్ని అధోగతికి తీసుకరావడమే కాకుండా- నీకూడా యెదుకూ పక్ [illegible] పోయింది, యీ అపవిత్రతవలన నీనోట్లో యిన్ని [illegible]దలడానికి కానీ,- నీమృత దేహానికి దహన సంస్కా[illegible]యడానికి కాని- యీపిల్లకు

పెళ్ళికాసిదే పనికిరాదు-" అని విన్నపుడు- అసలే పేలవంగా వున్న ఆమెముఖం కాగితంలా మరింత తెల్లబడేది.

చాలాకాలంనుంచి కష్టాలకు లోబడడం మూలాన దుర్గమణి మాతృహృదయం కరుడుకట్టింది. పంచప్రాణాలూ యేపిల్లమీద పెట్టుకుని, తను ప్రేమించిందో- ఆపిల్లనే యిప్పుడు చూస్తుంటే, హృదయం మండుకు పోతూవుంది! చుట్టుప్రక్కల వుండే ఆడవాళ్ళవల్ల, శాస్త్రాలూ, ధర్మాలు వింటూవుండడం వల్ల జ్ఞానద పనికిరాని ముల్లులా కనిపిస్తూవుంది మాయా, మమతా- యేవీ యిప్పుడామె హృదయంలో లేవు!

మరదిని పిలిచి-"ఆ వీధిలోని గోపాల భట్టాచార్యులు, మళ్ళీ పెళ్లిచేసుకునే ప్రయత్నంలో వున్నాట్ట! నేను చచ్చి పోకముందే- ఆఖరిసారిగా ప్రయత్నం చేయ్ బాబూ?" అని దుర్గమణి అడిగింది.

ఆమెమాటను నమ్మలేక అనాధనాథుడు-"లేదు-లేదు. గోపాలభట్టాచార్యులు యిప్పుడు పెళ్ళిచేసుకుంటాడా? వొట్టిదే యెవరైనా నీతో నవ్వులాటకు అన్నారేమో వదినా?." అని అన్నాడు.

ఓనిట్టూర్పు విడిచి-"నాతో యెవరు యెగతాళిగా మాట్లాడుతారు బాబూ?-అతను మగవాడాయె! అతని వయసును గురించి యెవ్వరూ అడగరు.. అతని వయసు వాళ్లే చాలామంది పెళ్ళి [illegible] కుంటున్నారాయె! ఒకసారి వెళ్ళి అసలు సంగతేమి [illegible] సుకొనిరా అనాధ్!-బ్రతి కుండగా నేనేమీ సుఖాని [illegible] పలేకపోయాను. చచ్చిపో

యింతర్వాత నైనా యింతనిప్పంటించుకునేందుక్కూడా నోచుకో లేదా-? కన్నకూతురి చేతినీళ్ళు త్రాగడానికికూడా నాకు అర్హత లేదా-" అని అడిగింది.

యీపిలను తొమ్మిదిమాసాలు కడుపులో పెట్టుకుని పోషించి-యెంతో యాతనపడి-యెంతో కష్టంతో కాపాడు కున్నదీ, ప్రేమతో పెంచుకున్నదీ, అంతా-యీ ఆఖరి గడి యల్లో యెందుకూ-పనికిరాకుండా పోవడానికేనా?- యెన్నో ఆశలు పెట్టుకుని, మమతతో ముద్దుగా పెంచుకున్నది-పిల్ల చేత్తో తన మృతదేహానికి నిప్పునుకూడా అంటించడానికి పనికి రానప్పుడు- అది నాకడుపున యెందుకని పుట్టాలి?- అని దుర్గమణి మాటిమాటికీ అనుకుని, పుద్వేగంతో లేచి కూచుని- "అనాధబాబూ? యెలాగైనాసరే యెక్కడైనా సరే_ఆఖరికి యెవరైనాసరే, జ్ఞానదకు వరుణ్ని చూసి పెళ్ళి చేయ్'-యిదే నిన్ను నేను వేడుకుంటున్న ఆఖరికోరిక.-భగ వంతుడు నిన్ను సుఖంగా కాపాడమని ఆశీర్వదిస్తున్నాను" అని అంది.

తన స్వార్థాన్ని వదులుకోలేక ఆనాడే. అనాధబాబు గోపాల భట్టాచార్యుని సంగతి కనుక్కునేందుకు వెళ్ళి,-ఆ విషయం నిజమేనని తెలుసుకుని ఆశ్చర్యపోయాడు! పైగా, నలుగురైదుగురు పెద్ద[illegible]లు, తమ పిల్లలను వివాహం చేసుకోమని ప్రబతిమిలా[illegible]లై తిరిగివెళ్ళి పోయారని కూడా విన్నాడు.

యెంతో కష్టంమీద-భట్టాచార్యులు యీపిల్లను పెళ్ళి చేసుకోవడానికి వొప్పుకున్నాడు. యీసంగతి దుర్గమణికి తెలిసింది. కొందరు దుర్గమణిని నిందించారు. మరికొందరు ఛీ ఛీ అన్నారు. అయినప్పటికీ కూడా ఆమె హృదయం చలించలేదు. ఆమె చావడానికి సిద్ధంగావుంది. యెలాగైనా జ్ఞానదను ఓ యింటిదానిని చేయాలి!-అదే ఆమె కోరిక.

కొంచెం సేపయింతర్వాత గోపాల భట్టాచార్యుడు, పిల్లను చూసి పెళ్లిచేసుకుంటానన్న కబురుపంపాడు. ఆమె యెంతో విచారపడింది.

గ్రీష్మకాలపు యెండలకు, వాడి-సొక్కిపోయిన గడ్డి మొక్క, వర్షపునీళ్ల జల్లువల్ల, యేవిధంగా తిరిగి తలెత్తుకుని నిలుచుంటుందో, అలానే దుర్గమణిలో మినుకుమినుకు మంటున్న ఆశ, కనురెప్పపాటులో జ్యోతిలా దేదీప్యమానంగా వెలిగింది. మరిది చేయిని పట్టుకుని "-అనాథబాబూ!-మీ అన్న చేయాల్సిన విధిని నీవుచేయాలి! జ్ఞానదను నాదహన సంస్కారానికి అర్హురాలినిగా చేసావంటే, నాకింకేమీ అక్కరలేదు అనాథ్!-యీజీవితానికి అదే ఆఖరి కోరిక'-యీవచ్చే పంచమినాడే లగ్నం స్థిరము యేట్టుచూడు!... పిల్లను చూసీ నిశ్చయించుకొమ్మని చెప్పిరా నాయనా!" అని అన్నది.

పెళ్లికానివాళ్ళు తల్లి[illegible]క్రియలు చేయడానికి పనికి రారనే సంగతి, శాస్త్రా[illegible]న్న యని విని, జ్ఞానద అన్నపానాదులు మానివేసింది. తను యితరుల దృష్టిలో

యెందుకూ పనికిరానిదై పోయినా-తొమ్మిది నెలలూ, మోసి-కని-పెంచి, పెద్దజేసిన, తల్లి మృతదేహానికి- చివరకు నిప్పంటించేందుకు కూడా, పనికిరాని జీవితమై పోయిందా, తనదని ఆమె మనసు బాధపడుతూవుంది.

చీకటి డడానికి యింకా ఆలస్యముంది. వంటింటిలో కూచుని జ్ఞానద తల్లికి పథ్యంచేస్తూవుంది. యింతలో ఆమె అందాన్ని పరీక్షించడానికి వచ్చారనే సంగతివిని, స్వర్ణమంజరి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూవచ్చి-"జ్ఞానదా! ఆవంట అలానేవుంచి యిలారా!-వాళ్లు నిన్ను చూడడానికి వచ్చారు. తొందరగా యేదో ఒకకోక కట్టుకో!-సాధారణంగా ముస్తాబయితే ఫర్వాలేదుట-తొందరగారా" అనిచెప్పి మళ్ళీ గబగబా వెళ్లిపోయింది.

ఆ సమయంలో అనాధనాధుడు యింట్లోలేడు. అందుకని స్వాగత సత్కారాలు స్వర్ణమంజరిమీద పడినయ్!-చూడడానికి వచ్చిన గోపాల భట్టాచార్యుడు, కుర్రవాళ్ళకు యెక్కువగా సౌందర్యం తెలుస్తుందని, వెంట తన బావమరిదిని తీసుకవచ్చాడు. ఆ కుర్రవాని ఆదేశానుసారంగా పిల్లను సాధారణమైన దుస్తులతోనే పిలవమని చెప్పారు.

గోపాల భట్టాచార్యుని బావమరది ఆరుగంటల బండికి కలకత్తా వెళ్ళాలి. అందువల్ల అతను తొందరపడుతున్నాడు. స్వర్ణమంజరి చాటున నిల్చు[illegible]కేకలువేస్తూవుంది. అయినా జ్ఞానద రాలేదు. స్వర్ణ[illegible]చూయింపుమీద పనికత్తె వెళ్ళి జ్ఞానదను తీసుకవచ్చింది. [illegible] చూస్తూనే కోపంతో

"-యివన్నీ విప్పు. యిలా అ ంచేసుకుని యెవరు రమ్మన్నారు? ఘో—విప్పవేం?" అని స్వర్ణమంజరి మండిపడింది.

పిల్లను చూడడానికి వచ్చినవాళ్ళు, యీగోలవిని, యేమిటో చూద్దామని మెడలుచాపి-చూసాక, మధ్యవర్తిగా వచ్చిన యువకుడు "-అలానే తీసుకొనిరాండి!-ఆలస్యమైతే నా పనంతా చెడిపోతుంది." అని అన్నాడు.

పనికత్తె-జ్ఞానదను తీసుకవచ్చి, ముందు నిలబెట్టింది. కుర్రవాడు ఆమె అలంకారాన్ని చూసి, వస్తూన్న నవ్వును ఆపుకుని లేచి-మామగారి చేయి పట్టుకుని వెళ్ళిపోయాడు. వెళ్ళేప్పుడు "-యేసంగతీ రేపు కబురు చేస్తాం" అని మాత్రం చెప్పి వెళ్ళాడు. ఫలహారాన్ని వాళ్ళముందు పెట్టినా-బావమరిదికి బండి అందదని ఆవస్తువుల్ని తాకకుండానే వాళ్లు వెళ్ళిపోయారు

పెద్దమ్మ గొంతు చించుకుంటూ,_తిట్టి-ఆయింట్లోని వాళ్లకూ, వీధిలోని వాళ్లకూ యేమిటేమిటో చెప్పింది. రెండో కోడలుకు, బాగుండడంలేదని విని- అయిదారుగురు పెద్ద మనుష్యులు వచ్చారు. యీ అరుపులకి, పెడబొబ్బలకి యింకా కొంతమంది పరుగెత్తుకుంటూ వచ్చారు ఆరుగంటల బండికి కలకత్తాకు వెల్దామని పోతూ, యీ గంద్రగోళమంతా విని-అత్త చనిపోయిందేమోనని అతులుడు కూడా లోపలకు వచ్చాడు.

...స్వర్ణమంజరి అతు మాడి, సిగ్గుతో వంగిపోయి భయంతో శవం జ్ఞానద ముఖాన్ని పట్టుకుని,

అతులునికి చూపుతూ "చూడు అతుల్!–ఒకసారి దీని ముఖం వేపు చూడు!-యీ వెధవముండ ముఖాన్ని, యీ సంకరపు ముఖాన్ని-కోతి ముఖాన్ని ఒకసారి చూడు–" అని అన్నది.

పెదిములకు వేసుకోవలసినరంగు, చెంపలకు. చెంపలకు వేసుకోవలసినరంగు గడ్డం క్రిందనూ. నొసట పెట్టుకోవలసిన బొట్టు,తలమీదా_ చీకటికోనంలోకూచుని జ్ఞానదే స్వయంగా అలంకరించుకుంది.నూనె సంపర్కం లేని జుట్టుమీద, సీసానూనె గుమ్మరించుకోవడంవల్ల, ఆనూనె చెంపలమీదకు కారుతూ వుంది. ప్రక్కనేకూచున్న ఆడవాళ్లు కిలకిలా నవ్వారు. ఒక స్త్రీ చంకలోనిపిల్ల "గ్యాని అత్తా! భలే వేషం వేసిందే!" అని వచ్చిరాని మాటలతో అన్నది. ఆమాటవిని అక్కడివాళ్లంతా ఫక్కున నవ్వారు. కానీ,- అతులుని హృదయానికి గాయాన్ని కలిగించినట్లయింది. చాలా శ్రద్ధగా జ్ఞానదను యివాళ అతను చూసాడు. యీమధ్య తను జ్ఞానదను చూడలేదు. జబ్బుపడడంమూలాన జ్ఞానద మొహం చెడిపోయిందనీ, చాలా అసహ్యంగా వుందనీ, యితరులనుకుంటుండగా అతను విన్నాడు. కానీ,-యింత ఇదిగా ఆమె చెడిపోతుందని అతనుకలలోకూడా అనుకోలేదు.

యింతయిదిగా ఆ ... అసహ్యంగావున్నా, ఆముఖంలో తనకుమాత్రం,- ... రాని అందం కనుపడుతూనేవుంది!

ఒకనాడు తనుజబ్బుతో చనిపోయేపరిస్థితి కలిగినప్పుడు యీముఖమే- తనకు చేయరాని వెట్టిచాకిరినంతా-నిద్రాహారాలు లేకుండా చేసి,రక్షించి-ఒడ్డున పడేసింది. యీముఖాన్నే తను ఆనాడు ప్రేమించింది! ఆ ప్రేమలో నిష్కల్మష భావముంది! ఆసంగతి గుర్తుకు రావడంతోనే, తనను తాను మరిచిపోయి, యేదో అనబోయేప్పటికి – స్వర్ణమంజరి కఠోర కంఠం ఆ మాటను అణచివేసింది.

" సిగ్గుమాలినతొత్తా!- చావడానికి సిద్ధంగావున్న ఆ ముసలిముండాకొడుక్కి, అందంగా కనుపించాలని వేషం వేసుకున్నావా?- అందుకనే బాగాఅయింది...ముఖంమీద చెప్పుకొట్టినట్లు వెళ్లిపోయాడు"

ఒకామె-"దయ్యానికి అలంకరించినట్లు, యెవరు అలంకరించారమ్మా- అందుకనే అతనికి నచ్చలేదు-?" అనిఅన్నది

"తనవంటికి తనే వేషం వేసుకుంది! తల్లేమో చావు బ్రతుకుల్లోవుంది.ఒక్క-చీర కట్టుకొని రమ్మంటే దీనికినచ్చలేదు. సింగారింపులేని దే. ఆముసలిపీనుగ మెచ్చుడనుకుందిగామోలు! యెన్నిబుద్ధులు!-...యెన్నిబుద్ధులు!- యింకేమయినా మంచి బట్టలున్నాయనుకుందామా-అదీలేదు. యెప్పటిదో యీచీరా, అతులుడు యిచ్చిన యీ మురుగులూ! యెందుకుజన్మ!— ఆ మురుగుల్నే పెద్దగొప్పగా [illegible]దిసార్లుతీసి, పదిసార్లు తొడుక్కుంటుంది. యీ మ[illegible]తొడుక్కుంటానికికూడా యీపాడుముఖానికి సి[illegible]నాదగ్గర్నుంచి వెళ్లిపో!" అని స్వర్ణమంజరి గబా[illegible]న్నది.

సిగ్గులేని ఆపిల్లసంగతివిని అందరూ ఛీ-ఛీ-అనుకుంటూ వెళ్ళిపోయారు.

జ్ఞానద లేచి నిలుచుంది. యింతవరకూ ఆమె యితరుల ముందు యేడ్చెరుగదు. యీనాడు అతులునిముందు, ఆమెకు కళ్ళంట నీళ్ళు కారనారంభించాయ్' ఆమె ఒక్కమాటకూడా మాట్లాడలేదు. యెటువేపూ చూడలేదు. కళ్ళను తుడుచుకుంటూ, తుడుచుకుంటూ-వెళ్ళిపోయింది.

కలకత్తా వెళ్ళడానికి బండి దాటిపోయినందున అతులుకు యింటికి యింటికి తిరిగివచ్చాడు. తిరిగివస్తూండగా, ఒకనాడు చిన్నత్త చెప్పివెళ్ళిన సంగతి గుర్తుకొచ్చింది-"నాయనా అతుల్! రత్నాన్ని విసిరిపారేసి- యెవరు కంచుముక్కను మూటకట్టుకుంటారో, వాళ్ళ నుకస్తాపానికి అంతుండదు. అన్నిసంగతులూ ముందే జాగ్రత్తగా చూడాలినాయనా!" అని—

యీ మాటల్లోని అర్థం ఆనాడు తను తెలుసుకోలేకపోయినా- ఆమె తనను గురించే ఆమాట అన్నదని యీనాడతను గ్రహించాడు.

తెల్లవారకముందే అనాధనాధుడు. వాకిలి దగ్గరకు వచ్చి "-అతుల్, చిన్న వదినకు దహనసంస్కారాలు చేయాలి-రా" అని కేకవేసి అతులుని పిల్చాడు.

"పదండి-వస్తున్నా" అంటూ అతులుడు లేచాడు.

అక్కడికి వెళ్ళి [illegible] ఘ్నున్నర క్రితం తులసికోట అరుగుమీద, తం[illegible]టుకుని కూచున్నట్లే,

యీనాడుకూడా జ్ఞానద—తల్లి పాదాలు పట్టుకుని కూచుని వుండడం అతులుడు చూసాడు. అందరూ శవాన్ని శ్మశానానికి తీసుకవెళ్ళే ప్రయత్నంలో వున్నారు.

యథా సమయానికి శవాన్ని శ్మశానానికి తీసుక వెళ్ళారు. వెనుకనే జ్ఞానదకూడా వెళ్ళింది. విచారవాహినిలో వుంది గనుక ఆపిల్లను ఓదార్చేవాళ్ళుగాని, ఆపిల్ల వెంట వెళ్ళేవాళ్ళుగాని లేక పోయారు. వెళ్ళాలని కూడా యెవరికీ తోచలేదు.

వర్షఋతువు కావడంవల్ల గంగానది నిండుగా— వేగంతో శ్మశానానికి ప్రక్కగా ప్రవహిస్తూవుంది. తల్లిగారి అంత్యక్రియలు మతిలేని దానిలా జ్ఞానదచేసి, చితి ధగధగ మండుతూవుంటే, మగవాళ్ళలోంచి యివతలకు వచ్చి గంగా నది నీళ్ళకు దగ్గరగా కూచుంది. అక్కడ కూచో వద్దని ఆమెను యెవరూ నిరోధించలేదు. అపారమైన దుఃఖాన్ని భరించలేక ప్రేమతో పెంచి, పెద్దజేసిన ఒక్కగాని ఒక్క తల్లిని కబళిస్తూ మండుతున్న చితిని చూడలేక, జ్ఞానద అలా నీళ్ళ దగ్గర కూచుందని అందరూ అనుకున్నారు.

నీళ్ళకు దగ్గరగా జ్ఞానద కూచోవడం అతులుడికి కను బడ్డంతోనే—అతని మనసు యెలాగో అయింది జ్ఞానదను అలా కూచోవద్దనీ, తను అక్క[illegible] వెళ్ళి కూచుందామనీ, అనుకుని—యీ రెంటిలో [illegible] చేయ లేక పోయాడు.

యెదురుగా [illegible] మంటలు సుడితిరుగుతూ— చిటపటలాడుతూ, [illegible]లు చాపుతూ— మండుతూవుంది.

అది నా సేప్పటికి, అతులునికి చిరకాలంనాటి ప్రశ్న మళ్ళీ మొలకెత్తింది.

"నిన్న యేద్దైతేవుందో,- యీనాడు అది లేదు. యీనాడు యేద్దైతేవుందో, ఆ అస్థిరమైన శరీరంగూడా, మెల్ల మెల్లగా గుర్తుపట్టలేనట్లు భస్మమవుతూవుంది. యికదాన్ని గుర్తుపట్టలేము. ఆశరీరము తిరుగుతున్నంత సేపూ, యెన్నో ఆశలు, యెన్నో ఆకాంక్షలు, యెన్నోభావాలు, కోర్కెలు అన్నీవున్నాయ్! కానీ-యిప్పుడవన్నీ యెక్కడికి వెళ్ళినయ్? ఒక్క నిమిషంలో అవన్నీ యెటువేపుకి అంతరించిపోయినయ్? మరి, వాటి విలువయెంత?-చచ్చిపోవడానికి యెంత కాలం పడుతుంది?"- యేమిటేమిటో ఆలోచిస్తూండగా. గబుక్కున అతులునికి, తన విగతజీవనకాలం గుర్తుకొచ్చింది. షుమారు మూడేళ్ళ క్రితం, తను చచ్చిపోవడానికికూడా సిద్ధమై, చచ్చేవాడల్లా బ్రతికాడు.-"నన్ను చావనీయకుండా ఆనాడు బ్రతికించిందామె!...నన్ను ప్రేమతో బ్రతికించినామె- యిప్పుడు గంగానది నీటి ప్రవాహం దగ్గర కూచునివుంది...!" అని మనసులో అనుకున్నాడు.

అతులుని రెండు కళ్ళూ, నీళ్ళతో నిండిపోయినై! మనసులోనే "-వెధవ [illegible]ము!-రూపానికే యింత విలువ వున్నట్లయితే, మూడే[illegible] బజారులో దమ్మిడీకికూడా పనికిరాని నాముఖాన[illegible]ద. యెంతో సేవ చేసింది. ఆనాడు భాగ్య[illegible]ప్పవాళ్ళు-నాముఖం వేపు

ట్లయితే, యీనాడు యెందుకూ పనికిరానివాణ్ణై పోయే వాణ్ని!" అని అనుకున్నాడు.

కాలం మెల్లగా దొర్లిపోతూవుంది. చితి ఆరిపోయిన సంగతే అతనికి తెలియలేదు. నిశ్చలమైన భావంతో గంగా నది వొడ్డున కూచున్న జ్ఞానదను చూస్తున్నాడు.

"యింకా కూచున్నావేం?–రా! మిగిలిన పని యిక పూర్తిచేద్దాం–పద" అని అనాథనాథుడు అన్నాడు.

"పదండి–" అంటూ అతులుడు లేచి నిలుచున్నాడు. అప్పటికి సూర్యుడుకూడా పశ్చిమానికి దిగిపోయాడు. మసక వెలుతురు మాత్రం నది వొడ్డున కనుపిస్తూవుంది. ఆ వెలుతురులో–పగులకొట్టి పారవేసిన మురుగుల ముక్కలమీద అతని దృష్టిపడింది. అవి తను యిచ్చినవే! జ్ఞానదకు యెక్కువ ప్రేమపూర్వకమైనవి, ఖరీదు గలవి! యెన్ని కష్టాలువచ్చినా యెన్ని ప్రయాసాలు కలిగినా, జ్ఞానద ఆమురుగుల్ని తీసివేయ లేదు. యీనాడు తనంతటతానే జ్ఞానద వాటిని తీసిపారవేసింది.

గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్ళి, పగిలిపోయిన కంచు మురుగుల ముక్కల్ని యే[illegible] వెనక్కు వచ్చాడు.

వెనుక అడుగుల [illegible] డడంవలన, జ్ఞానద ము ఖం–తిప్పిచూసింది [illegible] మని ప్రయత్నించి,

"పొరపాట్లు అందరివల్లావస్తుంటాయ్ జ్ఞానదా... కానీ" అని పిడికిలివిప్పి, కంచుముక్కలు చూపుతూ "నువ్విప్పుడు, యే కంచుమురుగుల్ని పగులగొట్టి పారవేసావో, అవన్నీ నేను యేరుకుని తెచ్చాను" అని అన్నాడు.-

"యెందుకు—?"

కళ్లంట నీళ్ళుకారుస్తూ అతులుడు "జ్ఞానూ! అత్తగారి చితిలో నేనొక వస్తువును స్పష్టంగా చూసాను. నేనుచూసి నదిమాత్రం యెప్పటికీ అబద్ధంకాదు. యీ హృదయంలోంచి యెప్పటికీ అదియిక బైటకుపోదు! బలవంతంగా కంచుము రుగుల్ని ముక్కలుగా చేయొచ్చునుకానీ,-నీకూనాకూ మధ్య వున్న యిచ్చి పుచ్చుకోవడాల్ని, చిన్నప్పటి స్నేహితాన్ని యెవరూ పాడుచేయలేరు. అవి అలాగే భద్రతగావున్నాయ్.! నేను చేయలేనిదాన్ని నువ్వుకూడా చేయలేవని నేను గ్రహిం చాను. మన[illegible]ముకు గుర్తయిన యీకంచుముక్కల్ని యేరు కుని యింటికి తీసుకవెల్తున్నాను జ్ఞానూ!" అని అన్నాడు.

జ్ఞానద అనిమేష దృష్టితో, చైతన్య హీనురాలుగా చూస్తూవుంది. అ[illegible]డు చేతులుచాచి, నిర్భలంగావున్న జ్ఞానద చేతుల్ని ద[illegible]క్కున్నాడు- జ్ఞానద అలానే చల నంలేని విగ్రహంల

చేయకు. నేనెన్ని అపరాధాలు చేసినా,-నువ్వు పరిగ్రహించి తీరాలి. అది నీధర్మం! నన్ను పరిత్యజించే శక్తి నీకెప్పటికీ లేదు-" అని కన్నీళ్లతో గద్గదికంగా అతులుడు అన్నాడు.

వంచిన తల అలానేవుంచి జ్ఞానద జవాబేమీ చెప్ప లేదు. రక్తమాంసాదులు లేని తనచేయిని, అతులుని చేతిలో పెట్టింది. కొన్ని ముహూర్తాలపాటు యిద్దరూ నిశ్శబ్దంగా వున్నారు, అతులుడు జానద చేయివదలి "యింటికి పద-! వాళ్ళు చాలాదూరం వెళ్లుంటారు" అని అన్నాడు.

[ ఆఖర్ ]







|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA102B132 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hasin |
| పేజీలు విడదీసినది | nandini |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | nandini |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |